


# అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము



డా॥ కోడూరి సుబ్బారావు

గాయత్రీ గ్రంథమాల : 40
అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము
ప్రతులు :1000

సృష్టి సంవత్సరము : 196, 08, 53, 106
విక్రమాబ్దము : 2062
శ్రీమద్దయానందాబ్దము : 182
శ్రీ పార్థివ నామ సం॥ శ్రావణపూర్ణిమ

**మూల్యము : రూ. 30-00**
**(తపాల ఖర్చులు అదనము)**

ప్రతులకు :
గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
12-10-586/6, వ్యాస్ సమాజము, సికింద్రాబాద్ - 61.

మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, నెం. 5, మాశెట్టి బిల్డింగ్
3-3-736 నుండి 740, కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.

విద్యార్థి పబ్లికేషన్స్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.
(ఆర్యసమాజము ఎదురుగా)

ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

డా॥ కోడూరి సుబ్బారావు, C/o. వైదిక వానప్రస్థ సాధక ఆశ్రమము,
హనుమాపురము. B.O. భువనగిరి - 508 116.



# ఈశ ప్రార్థన

ఋషిః - పరమేష్ఠీ ప్రజాపతిః
ఛన్దః - ఆర్చీం త్రిష్టుప్

దేవతా - అగ్నిః
స్వరః - ధైవతః

**అగ్నే ! వ్రతపతే ! వ్రతం చరిష్యామి**
**తచ్ఛకేయం, తన్మే రాధ్యతామ్ ।**
**ఇద మహ మనృతాత్ సత్యముపైమి ॥**

**(యజుర్వేదము. *1 - 5*)**

హే జ్ఞాన ప్రకాశక పరమేశ్వర ! సర్వ సత్యవ్రతములకు పతివైన ఓ వ్రతపతీ ! నేను అసత్యమును విడిచి సత్యమును గ్రహించు వ్రతమును అనుష్ఠించ గోరుచున్నాను. దానిని చక్కగా అనుష్ఠించగల సామర్థ్యమును నాకు ప్రసాదింపుము. అది నాకు ఆత్మికోన్నతిని కలిగించును గాక !

ఇప్పటినుండి నేను అనృతమునుండి విడివడి సత్యమువైపు పయనింతును గాక !

ఒక సుమ్నార్థి
కోడూరి సుబ్బారావు

# ప్రకాశకీయము

మా గాయత్రీ గ్రంథమాల 40వ పుష్పంగా ఈ "అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము' పాఠకులకు అందించ గలుగుచున్నందులకు ఆనందంగా వుంది. డా॥ కోడూరి సుబ్బారావు గారు ఈ గ్రంథంలో మనం అగ్నిహోత్రం ద్వారా నేర్చుకోవలసిన ఆధ్యాత్మిక పాఠాలను సరళభాషలో వివరించారు.

ముఖ్యంగా అగ్నిహోత్రం మనకు సమాజసేవ చేయమని ప్రేరేపిస్తున్నది. మనం ఏ మానవ సమాజంలో జీవిస్తున్నామో ఆ మానవ సమాజ ఉన్నతికొరకు మన శక్తివంచన లేకుండా పాటుపడాలి. అది వ్యక్తిగా కన్న ఒక సంస్థద్వారా చేయటం మంచిది. వ్యక్తిశక్తికన్న సంఘటితశక్తి గొప్పది. బలమైనది. దానివల్ల చక్కటి ఫలితాలు కలుగుతాయి. మనకు కూడా ఉత్సాహం కలుగుతుంది.

నేడు సమాజంలో సేవాభావం లోపించింది. పెక్కురు అర్థానికే దాసులౌతున్నారు. 'మనం మంచిగా బ్రతికితే చాలు' అనుకుంటున్నారు. విత్తేషణ దారేషణ లోకేషణలే పరమ పురుషార్థాలుగా భావింప బడుతున్నాయి. భగవద్గీతో యోగేశ్వర శ్రీకృష్ణుడు ఉపదేశించిన నిష్కామ కర్మయోగం పారాయణం వరకే పరిమితమైపోయింది. సమాజ సంక్షేమం కొరకు పాటుపడేవారు చాలా అరుదు. కనుక, మనం పరమేశ్వర ప్రాప్తియే పరమలక్ష్యంగా సమాజసేవ చేయగలిగితే అభ్యుదయంతోబాటు నిఃశ్రేయసాన్ని కూడా పొందగలుగుతాము. మన జన్మ ధన్యమౌతుంది.

ఈ లఘుగ్రంథం ఏ కొద్దిమందిలో సమాజసేవాస్పృహను కలిగించినా మా కృషి సఫలమైనట్లు భావిస్తాము.

మీ సేవలో

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

# ఈ గ్రంథములో

ప్రార్థన, ప్రాక్కథనము, ప్రకాశకీయము..... ముందు పుటలలో



చదవండి చదివించండి ఆచరించండి

ఆత్మోన్నతిని పొందండి

# ద్రవ్యదాత సంక్షిప్త పరిచయం

ప్రస్థుతం అమెరికాలో తమ కుమారులవద్ద ఉంటున్న శ్రీ మంద జగన్నాథరెడ్డి గారు కామారెడ్డి సమీపంలో గల వడ్లూరు గ్రామవాసులు. వారు కేవలం ఆ గ్రామవాసులేకాదు. ఆ గ్రామానికి దొరలు. అంటే, వారి పూర్వులు ఆ గ్రామానికి రాజులుగా ఉండేవారు. అందుచే, యిప్పటికీ ఆ గ్రామవాసులంతా వారిని "దొరగారు" అని పిలిస్తూ ఉంటారు. అట్లని వారుహుందాగా ఒక దొరగా వ్యవహరించరు. ఒక సామాన్య వ్యక్తిగానే అందరితో కలిసిపోతూ వారి కష్ట సుఖాలను అడిగి తెలుసుకుంటారు. కష్టాలలో ఉన్నవారికి ఏదో విధంగా సాయం చేస్తూనే ఉంటారు. వారు ధార్మికులు, ధర్మపరాయణులు, దానశీలురు. బ్రహ్మచారులకు, విద్వాంసులకు, సాధుసంన్యాసులకు దక్షిణలు ఇస్తూఉంటారు.

వారు ఒకసారి కామారెడ్డి ఆర్షగురుకులంలో ప్రతి సంవత్సరం జరిగే 'పాతంజలి యోగ సాధన శివిరం'లో పాల్గొన్నారు. దానితో వారికి 'వైదిక ధర్మం'తో పరిచయం కలిగింది. దానితో వారిలో వివేకం జాగృతమయ్యింది. క్రమంగా మూఢనమ్మకాలన్నీ తొలగిపోయాయి. ఇంకా యింకా వైదిక విజ్ఞానాన్ని తెలుసుకోవాలనే జిజ్ఞాస పెరిగిపోయింది. వారు డిప్యూటి తహసిల్‌దార్‌గా ఉద్యోగవిరమణ చేసిన విద్యావంతులు. ఆంధ్రభాషతోబాటు ఆంగ్ల, ఆర్య భాష (హిందీ)లలో ప్రవేశం ఉన్నవారు. అందుచే హిందీలో లభించే విస్తృత వైదిక సాహిత్యాన్ని ఖరీదుచేసి స్వాధ్యాయం చేయటం ప్రారంభించారు. చదివే కొలది వారి జిజ్ఞాస పెరుగుచున్నదేకాని తరుగుట లేదు.

వారి స్వాధ్యాయంలో ఏవైనా క్రొత్త విషయాలు, ముఖ్య విషయాలు వస్తే వాటిని నాకు తెలుపుతూ 8, 10 పేజీల పెద్ద పెద్ద ఉత్తరాలు వ్రాస్తూ వుంటారు. సందేహాలు వ్రాసి తెలిసికొంటూ ఉంటారు. వారు వ్రాసే ఉత్తరాలను చదువుతూ వుంటే నాకు ఆశ్చర్యంగాను, ఆనందంగాను ఉంటుంది. వారు అమెరికాలో తమ కుమారుల యింటఉండికూడా

వానప్రస్థులకన్న ఎక్కువగా స్వాధ్యాయతపస్సులలో గడుపుతున్నందుకు అభినందించకుండా ఉండలేకపోతున్నాను. వారిది కాలక్షేపంకోసం చేసే స్వాధ్యాయం కాదు. యౌగిక ప్రవృత్తితో కూడిన స్వాధ్యాయం. ఆచరించి ఆత్మోన్నతిని పొందటంకోసం చేసే స్వాధ్యాయం. తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియా యోగః' అని పతంజలి మహర్షి అంటారు. ఈ మూడూ వారు ఆచరిస్తున్నారు.

ఇంద్రియ నిగ్రహపరులై నిరాడంబరంగా తాపసిక జీవనం గడుపుతున్నారు. మోక్ష శాస్త్రాల నధ్యయనం చేస్తూ కాలమంతా స్వాధ్యాయంలో గడుపుతున్నారు. ఈశ్వర ప్రణిధానంకూడా వారు చేస్తున్నారు. ఎంతటి త్యాగం దానధర్మాలు చేసినా పేరు ప్రతిష్ఠలు కోరరు. అజ్ఞాతంగానే అవి వారు చేస్తూ వుంటారు. రెండు సంవత్సరాలుగా నాకు సాయం చేయటమే గాక నా రచనల ముద్రణ కొరకును ఆర్థికసాయం చేస్తున్నారు. మీ ఫోటో మరియు కుటుంబ పరిచయం వ్రాసి పంపమని ఉత్తరం వ్రాస్తే - "అవి ఏమీ వ్రాయనవసరం లేదు. అందరికి న్యాయంగా కర్మఫలాలనిచ్చే సర్వాంతర్యామికి అన్నియును తెలియును కదా!" అని ప్రత్యుత్తరం వ్రాసారు. అందుచే వారి కుటుంబ పరిచయం వివరంగా వ్రాయలేకపోతున్నాను.

వీరికి ఒకే మాటగా, ఒకే బాటగా నడిచే అనుకూలవతియైన ధర్మపత్ని మరియు శ్రీచంద్రశేఖర్, శ్రీఅశోక్ అను పేర్లుగల యిద్దరు కుమారులు ఉన్నారు. కొడుకులు, కోడండ్రు, మనుమలు, మనుమరాండ్రు అంతా వీరికి అనుకూలంగానే ఉంటారు. అత్యంత ప్రేమ ఆదరణలతో చూసుకుంటారు. వారి బాటలోనే అంతా నడుస్తారు.

పరమపితమయైన పరమేశ్వరుడు శ్రీ జగన్నాథరెడ్డి గారికి, వారి కుటుంబము వారందరికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాదుల నిచ్చి కాపాడును గాక !

కోడూరి సుబ్బారావు

# ప్రాక్కథనము

(ముందు మాటలు)

భారతీయ సంస్కృతిలో పంచ మహాయజ్ఞాలకు ప్రముఖ స్థానం ఉంది. అందు రెండవదియైన దేవయజ్ఞం అనగా అగ్నిహోత్రం షోడశ సంస్కారాలన్నిటిలోను విశిష్టస్థానం కలిగిఉంటుంది. అగ్నిహోత్రంతోనే అన్ని సంస్కారాలు, శుభకార్యాలు, వేడుకలు, విందులు వినోదాలు ప్రారంభించవలె ననునది ఆర్యుల (శ్రేష్ఠ పురుషుల) శిష్టాచారం.

అగ్నిహోత్రంవలన కలుగు వైజ్ఞానిక ప్రయోజనా లనేకం. వాటిని సంక్షిప్తంగా రెండు పుస్తకాలుగా మే మిదివరలో ప్రచురించి యుంటిమి. అవి 1. అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము, 2. అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ.

ఈ మధ్య నేను శ్రీ స్వామి సమర్పణానంద గారి భాష్యంతో కూడిన 'శతపథ బ్రాహ్మణం' రెండు అధ్యాయాలు చూసాను. తదుపరి శ్రీ స్వామి దీక్షానంద సరస్వతి గారి 'అగ్నిహోత్ర సర్వస్వం' అనే పుస్తకాన్ని చదివాను. అప్పుడు నాకు అగ్నిహోత్రం వైజ్ఞానిక ప్రయోజనంకొరకేగాక ఆధ్యాత్మిక ఔన్నత్యముకొరకుకూడా ఎంతగానో ఉపకరించ గలదని గ్రహించాను. దానిని మననంచేసి తెలుగు పాఠకులకు అనుకూలంగా ఉండేవిధంగా ఒక చిన్న పుస్తకంగా వ్రాయాలని సంకల్పం కలిగింది. పరమపిత పరమేశ్వరుని అనుగ్రహం వల్ల నా ఆరోగ్యం కొంత మెరుగుపడింది. అందుచే నెమ్మదిగా ఈ చిన్న పుస్తకం వ్రాయగలిగితిని. నేను పండితుడను కాను. సామాన్య పాఠకుడను. స్వాధ్యాయం ద్వారా నేను గ్రహించిన కొన్ని విషయాలను తెలుగు పాఠకులకు తెలుపవలెనను కుతూహలంతో ఈ రచనకు పూనుకొంటిని. కాన, విద్వాంసులు ఇందేవైనా దోషములున్నచో తెలుపగోరెదను. పునరాలోచించి తదుపరి ముద్రణలో సవరించుకోగలవాడను.

మానవ జన్మ కర్మయోని. ప్రారబ్ధాన్ని అనుభవిస్తూనే ఉత్తమ కర్మలు చేసి ఉన్నతిని పొందడానికి యిది ఒక చక్కని అవకాశం. ఏ కారణచేతనైనా శాస్త్రవిహితమైన కొన్ని కర్మలను వదిలిపెట్టినా యజ్ఞ దాన తపస్సులను విడువరాదని కర్మయోగి శ్రీకృష్ణుని ఉపదేశం.

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥**

(భగవద్గీత. 18-5)

యజ్ఞ దాన తపస్సులు మూడును మానవుని పవిత్రుని చేసి పరమాత్ముని చేర సహకరిస్తాయి. వాటిని కూడా - ఆసక్తిని ఫలాకాంక్షను వదలి చేయాలి. 'ఇది నా కర్తవ్యం' అనే భావంతో చేయాలి. అదే అన్నిటికన్న ఉత్తమం - అని శ్రీకృష్ణుని ఉపదేశం.

**ఏతా న్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలానిచ ।**
**కర్తవ్యా నీతి మే పార్థ ! నిశ్చితం మత ముత్తమమ్ ॥**

(భగవద్గీత. 18-6)

యజ్ఞదాస తపస్సులు కూడా సాత్త్విక రాజసిక తామసికము లని మూడు విధాలుగా ఉంటాయి. అందు సాత్త్విక యజ్ఞదాన తపస్సులనే మనం ఆచరించాలి. అవే మనకు ముక్తిని ప్రసాదిస్తాయి. రాజసిక తామసికములు మనకు బంధకారణమే అవుతాయి. కాన, యజ్ఞదాన తపస్సులను ఆచరించునపుడు రాజసిక తామసిక ప్రవృత్తులు రాకుండా జాగ్రత్త వహించాలి.

ఇచ్చట యజ్ఞం అంటే కేవలం అగ్నిహోత్రం కాదు. "యజ్ఞ" పదానికి చాలా విశాలమైన అర్థాలున్నాయి. పరోపకారం కొరకు చేసే మంచిపనులన్నీ యజ్ఞాలుగానే పరిగణించబడతాయి. అయితే, ఆ పరోపకార కర్మలలో అగ్నిహోత్రాన్ని శ్రేష్ఠతమ కర్మగా ఋషులు నిర్ణయించారు. ఎందుచేతనంటే, అది పక్షపాతం లేకుండా ప్రాణులన్నిటికి మేలు చేస్తుంది. కావున అగ్నిహోత్రాన్ని ఆదర్శంగా తీసుకుని - పాఠశాలగా భావించి నిత్యం

రెండువేళలా అగ్నిహోత్రాన్ని ఆచరిస్తూ ఉంటే మనం ఆచరించే కర్మయోగంలో పొరబాట్లు జరుగకుండా ఉంటాయి.

అగ్నిహోత్రకార్యంలో ఘృతము (నెయ్యి), సమిధలు, హోమ ద్రవ్యాలు, యజ్ఞవేది మనకు ఏ ఏ ఆధ్యాత్మిక సందేశాల నిచ్చుచున్నాయో ఈ లఘుగ్రంథాంలో సంక్షిప్తంగా తెలుప ప్రయత్నించాను. ఋషుల దృష్టికోణం ఏమిటో సూచించాను. వివరంగా తెలుసుకోగోరేవారు ఆర్య విద్వాంసులు వ్రాసిన శతపథ బ్రాహ్మణ భాష్యములు చదువగోరెదను.

నేను ప్రతిదినం మా గురుదేవులు కీ॥శే॥ పండిత గోపదేవ శాస్త్రిగారు అనువదించిన "వైదిక వినతి"లో ఒక వేద మంత్రం చదువుతూ ఉంటాను. అందలి వారి భాష గ్రాంథికమే అయినా చాలా సరళంగాను మధురంగాను వుంది. అందుచే, అట్టి శైలిని అనుసరిస్తూ ఈ గ్రంథం వ్రాయాలని సంకల్పించి గ్రంథాన్ని పూర్తి చేసాను. కంపోజింగ్ కూడా పూర్తయ్యింది. తదుపరి కొందరు మిత్రులు నేటి కాలానికి గ్రాంథికభాషకన్న వ్యవహారభాష ఆకర్షణీయంగాను అనుకూలంగాను ఉంటుందన్నారు. ఆలోచించి చూస్తే, నేటి కాలానికి వ్యవహారభాషనే (మీడియా భాషనే) అనుకూలం. భాషను మార్చి వ్రాసే ఓపికలేక ఈ గ్రంథాన్ని యిట్లే ప్రచురిస్తున్నాను. తదుపరి గ్రంథాలు వ్యవహార భాషలో వ్రాయ ప్రయత్నిస్తాను.

నన్ను పుస్తకముల వ్రాయ ప్రోత్సహిస్తూ ఆర్థికంగా సహకరిస్తున్న శ్రీమాన్ మంద జగన్నాథరెడ్డి గారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు. నా దస్తూరిని (చేతి వ్రాతను) జాగ్రత్తగా అర్థం చేసుకుంటూ కంప్యూటర్‌లో కంపోజింగ్ చేసిన శ్రీ వినోద్ కుమార్ చకిలం గారికి నా శుభాకాంక్షలు. పుస్తకమును అందంగా తీర్చిదిద్దిన ప్రింట్‌షాపు యజమానులకు, కార్యకర్తలకు నా ధన్యవాదములు.

ఒక సుమ్వార్థి

కోడూరి సుబ్బారావు

# ఆధార గ్రంథావళి

1. శ్రీ స్వామి సమర్పణానంద సరస్వతి (పం. బుద్ధదేవ్ విద్యాలంకార్) గారి - శతపథ బ్రాహ్మణ భాష్యము.

2. శ్రీ స్వామి దీక్షానంద సరస్వతిగారి - అగ్నిహోత్ర సర్వస్వము.

3. శ్రీ పం. వీరసేన్‌జి వేదశ్రమీ వేదవిజ్ఞానాచార్య గారి - యాజ్ఞిక ఆచార సంహితా.

4. శ్రీ పం. యుధిష్ఠర్ మీమాంసక్ గారి - వైదిక నిత్యకర్మ విధి.

# యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో హమారే భావ ఉజ్జ్వల కీజియే ।
ఛోడదేవేఁ ఛల కపట్‌కో మానసిక బల దీజియే ॥ 1

వేదకీ బోలేఁ ఋచాయే ఁ సత్యకో ధారణ్ కరేఁ
హర్షమే ఁ హో ఁ మగ్నసారే శోకసాగరసే తరే ఁ ॥ 2

అశ్వమేధాదిక్ రచాయేఁ యజ్ఞా పర ఉపకార కో ।
ధర్మమర్యాదా చలాకర్ లాభ్ దే ఁ సంసార కో ॥ 3

నిత్య శ్రద్ధాభక్తి సే యజ్ఞాది హమ్ కరతే రహే ఁ ।
రోగ పీడిత విశ్వ కే సంతాప్ సబ్ హరతే రహే ఁ ॥ 4

కామనా మిట్ జాయ్ మన్‌సే పాప అత్యాచార కీ ।
భావనాయేఁ పూర్ణ హోవేఁ యజ్ఞ సే నరనార కీ ॥ 5

లాభకారి హో హవన్ హర్ జీవధారీ కేలియే ।
వాయుజల సర్వత్ర హో శుభగంధ కో ధారణ్ కియే ॥ 6

స్వార్థ భావ్ మిటే హమారా ప్రేమపథ విస్తార హో ।
'ఇద న్న మమ కా' సార్థక ప్రత్యేక మేఁ వ్యవహార హో ॥ 7

ప్రేమ్‌రస్ మే తృప్త్ హోకర్ వందనా హమ్ కర్ రహే ఁ ।
నాథ్ కరుణా రూపకరుణా ఆప్‌కీ సబ్ పర్ రహేఁ ॥ 8

# అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము

## కర్మకాండ

అగ్నిహోత్రము భారతీయు లాచరించు పంచ మహాయజ్ఞములలో రెండవది. దీనినే దేవయజ్ఞము - దేవతల కొరకు చేయబడెడు యజ్ఞము అని పేర్కొందురు. మొదటిదైన బ్రహ్మయజ్ఞములో సర్వవ్యాపకుడు సర్వంతర్యామి సర్వేశ్వరుడునైన పరమేశ్వరుని స్తుతి ప్రార్థ నోపాసనలు చేయదురు. అందును నాలుగు భాగము లున్నవి. ముందుగా-అతడు తనకు లభించిన సర్వోత్తమ మానవ శరీరమును బలముగా ఆరోగ్యముగా నుంచమని భగవంతుని ప్రార్థించును. తన ఇంద్రియములు, శరీరాంగములు పవిత్రముగానుండి పవిత్రకార్యములయందే ప్రవృత్తములగునట్లు ప్రేరేపింపుమని కోరును. ప్రాణాయామముద్వారా ప్రాణశక్తులను బలపరచుకొన యత్నించును.

రెండవ భాగములో సామాజిక ప్రాణిగా తన మనుగడ సాగించవలసియున్నదిగాన తోటి ప్రాణులయడల తనకు ద్వేషము కలుగకుండుటకు గట్టి సంకల్పము చేయును. పరమేశ్వరుడు తనకు నాలుగువైపుల క్రింద పైన అంతట వ్యాపించి తనను అనేక విధములుగా కాపాడుచున్నట్లు గుర్తించును. ఈ సృష్టిలోని సమస్త ప్రాణులు తన వంటి జీవులే ననియు, అన్నిటికి సృష్టికర్తయైన పరమేశ్వరుడే తండ్రియనియు భావించును. తనలో దాగియున్న ద్వేషభావములను వెదికి వెదికి వాటన్నిటిని సర్వత్ర విస్తరించియున్న పరమేశ్వరుని న్యాయరూప బాహువుల కర్పించి ద్వేషరహితుడై శాంతిని బొందును. ఆ విధముగా శాంతమనస్కుడై

మూడవదైన ఉపస్థాన భాగము నాచరించును.

సర్వవ్యాపకుడైన పరమాత్మ ఈ సృష్టియందేకాక తన మనోబుద్ధుల యందును జీవాత్మయైన తనయందును వ్యాపించియున్నట్లుగా అనుభూతిని బొందుచు అంతర్ముఖు డగును. గాయత్రీ మంత్రమును జపించుచు తనకు ధారణశక్తిగల వివేకబుద్ధిని ప్రసాదించమని ప్రార్థించును. సదా సత్కర్మలయందు ప్రేరేపింపుమని వేడుకొనును.

బ్రహ్మయజ్ఞములోని పై మూడు భాగములు కేవలము ప్రార్థనా భాగములే. ప్రయత్నముతో కూడిన ప్రార్థనయే ఫలవంతమగు ననునది సృష్టి నియమము. కాన, చివరి నాలుగవ భాగములో వివేకబుద్ధిని కలిగించు వేదాది శాస్త్రలముల నధ్యయనము చేయును. అనగా స్వాధ్యాయము చేయును. భ్రమ ప్రమాదములు లేని ఈశ్వరీయ జ్ఞానమైన వేదములకే స్వాధ్యాయమున ప్రథమస్థాన మిచ్చును. తదుపరియే ఋషికృత దర్శన ఉపనిషదాదుల నధ్యయనము చేయును. ఈ విధముగా ప్రతి వ్యక్తి బ్రహ్మయజ్ఞము నాచరించ వలయును. ఇది ప్రతి దినము రెండు పర్యాయములు ఉదయ సాయం సంధ్యాసమయాలలో చేయవలెను. స్వాధ్యాయం ఉదయం సంధ్యా అగ్నిహోత్రముల తదుపరియు, సాయంత్రం అగ్నిహోత్ర సంధ్యావందనముల తదుపరి భోజనముచేసి కొద్దిసేపు భ్రమణమొనర్చి రాత్రి పరుడంబోవుముందు చేయుట అనుకూలముగా నుండును.

బ్రహ్మయజ్ఞమువలన మనస్సు నిర్మల మగును. శాంతిని బొందును. బుద్ధి వికసించి జ్ఞానము దినదిన ప్రవర్ధమాన మగును. అంతమాత్రమున సరిపోదు. ఆ జ్ఞానమునకు అనుగుణమైన జీవనము గడపినప్పుడే అది ఫలవంతమై మనను సమస్త దుఃఖములనుండి విడిపించి

పరమానందపదమును చేర్చును. అట్టి జ్ఞానపూర్వక సత్కర్మాచరణనే కర్మకాండ యందురు. తత్త్వవిధులు జ్ఞానమును నేత్రము తోను, కర్మను కాళ్ళతోను పోల్తురు. నేత్రములు దారిచూపగా కాళ్ళు నడచి గమ్యమును చేర్చును. అట్లే జ్ఞానము సరియైన దారిచూపగా తదనుగుణమైన కర్మలు మనను నడిపించి పరమానంద పదమునకు చేర్చును.

సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు సృష్ట్యాదిలో ముందుగా మానవులకు ఋగ్వేదము ద్వారా జ్ఞానోపదేశము చేసెను. దీనినే జ్ఞానకాండ యందురు. తదుపరి ఏ ఏ కర్మలవలన భౌతిక, సామాజిక - ఆత్మికోన్నతులు కలుగగలవో అట్టి కర్మలను (కర్మకాండను) యజుర్వేదము ద్వారా ఉపదేశించెను. జ్ఞానకర్మల ద్వారా మానవులకు ఉపాసనా సామర్థ్యము కలుగును. ఎట్లు పరమేశ్వరోపాసన చేసి పరమానందము బొందగలమో దానిని సామవేదము ద్వారా తెలిపెను. చివరగా అథర్వవేదముద్వారా విజ్ఞాన కాండను ఉపదేశించెను.

ప్రథమ మానవసృష్టి సమయముననే ఈ ఋగ్ యజు సామ అథర్వవేదములను వరుసగా సమాధిస్థులైన అగ్ని వాయు ఆదిత్య అంగిరస ఋషుల బుద్ధుల యందు ప్రకాశపరచెను. ఈ నలుగురి నుండి ఒక మహర్షి నాలుగువేదములను గ్రహించి, ధారణచేసి బ్రహ్మ యను పేరుతో ప్రసిద్ధిని బొందెను. తదుపర గురుశిష్య పరంపరగా ఈ చతుర్వేదములు అనుశ్రుతము చేయబడుచు చాలాకాలము అనుశ్రుతములుగానే నుండిపోయినవి. కాలాంతరమున మానవులయందు ధారణాసామర్థ్యము తగ్గుచుండుటచే వాటిని లిపిబద్ధముచేసి నేటివరకు కాపాడుకుంటూ వచ్చిరి. వేదకాలమునాడే కొందరు ఋషులు ఆ యా మంత్రముల విశేషార్థములను తెలిసికొనగోరి

సమాధిస్థులైరి. అట్టి యోగ్యులైన ఋషులకు అంతర్యామియైన పరమేశ్వరుడు వారు తెలిసికొనగోరెడి మంత్రార్థములను విశదపరచెను. వారు ఆ మంత్రార్థములను లోకమున ప్రచారముచేసి విద్యావిజ్ఞానములను వికసింపజేసిరి. అందుచే కృతజ్ఞతా సూచకముగా ఆ యా మంత్రములకు ఆ యా ఋషుల నామములు చేర్చబడినవి. కాన-ఋషులు మంత్రార్థ ద్రష్టలేకాని మంత్రకర్తలు కారు.

ఆ చతుర్వేదములలో అగ్నిహోత్రాది క్రతువులను అనగా కర్మకాండను తెలుపు యజుర్వేదము ఈ క్రింది మంత్రముతో ప్రారంభమగును.

**ఇషే త్వోర్జే త్వా వాయవస్థ దేవో వః**
**సవితా ప్రార్పయతు శ్రేష్ఠ తమాయ కర్మణ,**
**ఆప్యాయధ్వ మఘ్న్యా ఇంద్రాయ భాగమ్,**
**ప్రజావతీ రనమీవా అయక్ష్మా మావస్తేన ఈశత,**
**మాఘశంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత,**
**బహ్వీర్యజమానస్య పశూన్ పాహి ॥ (యజుర్వేదము 1-1)**

ఈ మంత్రమునకు ఋషి 'పరమేష్ఠీ పజాపతిః' అనగా ఈ మంత్రార్థమును సమాధిస్థుడై ముందుగా తెలిసికొని ప్రచారముచేసిన ఋషి - పరమేష్ఠీ ప్రజాపతి. ఇది ఆ ఋషి అసలుపేరు కాకపోవచ్చును. ఇష్టిః పదము 'ఇషు - ఇచ్ఛాయామ్' అను ధాతువుతో నిర్మితమగును. కోరుట అని దీని అర్థము. అగ్నిహోత్రము కోరికల నీడేర్చు కామధేనువు కనుక ఇష్టిః పదమునకు యజ్ఞము అనికూడా అర్థము చేర్చబడినది. 'ప్రజాపతిః అనగా ప్రజలను పాలించునది' యని అర్థము. వాతావరణమును శుద్ధిచేసి, ఋతువులను సక్రమపరచి ప్రజలను కాపాడును కనుకనే ఆదిదైవికార్థములో అగ్నిహోత్రమునకు ప్రజాపతి

యని పేరు. అందుచే ప్రజాపతికి అనగా అగ్నిహోత్రమునకు పరమేష్ఠీ (కోరికల నీడేర్చు వానిలో శ్రేష్ఠమైనది) అను విశేషణము చేర్చబడినది. ఈ విషయమునే ఈ మంత్రార్థ ద్రష్ట ప్రచారము చేసియుండును. కనుక ప్రజలు ఆ ఋషిని 'పరమేష్ఠీ ప్రజాపతిః, అనెడి ఉపనామముతో పిలిచి యుందురు. ఈ ఋషి ఈ ఒక్క మంత్రమునకే కాక అగ్నిహోత్ర ప్రాశస్త్యమును తెలుపు మరెన్నో మంత్రములకు ఋషిగా యజుర్వేదమున కనబడును.

పావమానీర్యో అధ్యేత్యృషిభిః సంభృతం రసమ్
తస్మై సరస్వతీ దుహే క్షీరం సర్పిర్మధూదకమ్ ॥

(ఋగ్వేదము. 9-67-32)

ఎవరు పవిత్రపరచు పరమేశ్వర ప్రదత్త వేదవాణిని అధ్యయనము చేయుదురో వారికి ఋషిజ్ఞానము ఆ మంత్రార్థమును స్పష్టీకృతము చేయును. అట్టి సరస్వతి క్షీరమును ఘృతమును మధువును ఉదకమును ప్రవహింపజేయును.

ఈ మంత్ర దేవత 'సవితా'. అనగా ప్రేరకుడు. దీని మూల ధాతువు 'షూ - ప్రేరణే'. సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు. జీవాత్మలమైన మనలో అంతర్యామిగా నుండి ప్రేరణ కలిగించు చుండును. సత్కర్మలు చేయునపుడు ఆనంద ఉత్సాహ ప్రోత్సాహములను, దుష్కర్మలు చేయునపుడు భయ సంకోచ లజ్జాదులను కలిగించు చుండును. అందుచే ఆధ్యాత్మికార్థములో సవితా పదము పరమేశ్వరునికే వర్తించును. ఈ మంత్రమున ఆ సవితా దేవుని ప్రార్థన మరియు ప్రబోధములు గలవు.

ఓ అంతర్యామివైయున్న సవితా పరమేశ్వర ! ఇషే త్వా ఊర్జేత్వా = అన్నముకొరకు, బలము కొరకు నిన్ను ప్రార్థించుచున్నాను.

వాయవః స్థః=ప్రాణాది వాయువుల మాలో స్థిరముగా,

బలముగా నుండును గాక !

దేవః వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే= సవితా దేవుడు మిమ్ము శ్రేష్ఠతమ కర్మలయందు ప్రేరేపించును గాక !

అప్యాయధ్వమ్ = ఆ సత్కర్మల నొనర్చి మీరు ఉన్నతిని బొందుదురు గాక!

అఘ్న్యా ఇంద్రాయ భాగమ్ = గోవులు మానవ మాత్రులందరకు తమ దుగ్ధభాగముల నిచ్చును గాక !

ప్రజావతీః = అవి బహుసంతానమును ప్రసవించుచు మీకు సమృద్ధిగా పాల నిచ్చుచుండు గాక !

అనమీవాః = ఆ గోవులు అంటురోగములను కలిగించునవి కాకుండును గాక !

అయక్ష్మాః = క్షయాది కృశ్యత్వమలు లేనివిగా నుండును గాక!

మా వః స్తేన ఈశతే = చోరులు (మిమ్ము దోచుకొను రాజులు లేదా ప్రభుత్వము) మిమ్ము పాలింపకుందురు గాక !

మా అఘశంసః = ఆ పాలకులు పాపులు కాకుందురు గాక !

ధ్రువాః అస్మిన్ గోపతౌ స్యాత = ఈ గోరక్షకునియందు తగిన రక్షణ సామర్థ్యముండును గాక !

బహ్వీర్యజమానస్య పశూన్ పాహి = హే సవిత ! యజ్ఞకర్తయొక్క పశుగణములను వృద్ధిపరచి కాపాడుము.

జ్ఞానమువలన గమ్యము తెలియును. గమ్యమును చేరవలెనన్న పయనించవలసి యుండును. ఆ పయనమే కర్మకాండాచరణ. ఆ కర్మకాండ నాచరించవలెనన్న ఏప సాధన సంపత్తు లవసరమో పై యజుర్వేద ప్రథమ మంత్రము మనకు తెలుపుచున్నది. కర్మలను ఆచరించుటకు ముందుగా

కావలసినది ఇషః అనగా అన్నము (ఆహారము). కాన, ముందుగా మనము సమకూర్చుకోవలసినది తగినంత పోషకాహారము. పోషకాహార సమృద్ధి. తదుపరిది ఊర్జ (శక్తి). ఆ పోషకాహారము మన జీర్ణకోశములో జీర్ణమై రసముగా (లింఫ్‌గా) మారి శక్తిగా పరిణతి చెందవలెను. కాన, తగిన పరిశ్రమ లేదా వ్యాయమాదులతో మన శరీరమును బలపరచు కొనవలెను. ఈ అన్న బలములతో బాటు మరియొకటి కావలసియున్నది. అదియే ప్రాణశక్తి. దీనినే ధాతుశక్తి, వైటాలిటీ, రోగనిరోధకశక్తి మొదలైన పేర్లతో వైద్యులు పేర్కొందురు. ఈ ప్రాణశక్తి ఎవరిలో ఎక్కువగా నుండునో వారిలో శరీర వ్యాపారములన్నీ సక్రమముగా జరిగి వారు రోగరహితులుగా బలముగా నుందురు. ఉత్సాహముగా కార్యోన్ముఖులు కాగలగుదురు. అందుచేతనే పై మంత్రములో 'వాయవః స్థ' మాలో వాయువులు స్థిరముగా నుండును గాక! యని సంకల్పింపబడినది. ఆరోగ్యకర దినచర్యవలన, ప్రాణాయామము వలన, మనః ప్రసాద సౌమ్యత్వము వలన మనలో ప్రాణశక్తి బలపడును 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం' అని చెప్పినట్లు శరీరం ఆరోగ్యంగా బలంగా ఉన్నపుడే కదా ! మనం ఏదైనా సాధించగలుగుతాం.

తదుపరి కావలసినది పరమేశ్వరుని ప్రేరణ. పెద్దలవలన గురువుల వలన వచ్చు ప్రేరణలకన్న అంతర్యామియైన సవితాదేవుని వలన వచ్చు ప్రేరణలు గొప్పవి. అవి మనకు అన్నివేళల ప్రోత్సహించుటయేగాక సత్యమార్గమున నడిపి కాపాడుచుండును. కావుననే పరమేశ్వరుడు ఈ మంత్రమున 'దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే' – సవితా దేవుడు మిమ్ములను శ్రేష్ఠతమ కర్మలయందు ప్రేరేపించుచుండును గాక' యని ప్రబోధించుచున్నాడు. కాన, మనము ప్రతిదినము ఉదయ సాయం సంధ్యాసమయములలో ఉపాసన చేయుచు

అంతర్యామినుండి వచ్చు ప్రేరణలను గుర్తించు చుండవలెను. దానితోబాటు శ్రేష్ఠతమ కర్మలు ఎవ్వియో తెలిసికొనుటయు అవసరమే.

'ఆప్యాయధ్వం' మనము చేసిన ఆ సత్కర్మలు మనకు ఉన్నతిని కలిగించాలి. తృప్తినికూడా కలిగించాలి. మంత్రములోని తదుపరి భాగములో గోవులు ఆరోగ్యముతో బహుసంతానవతులై మీకు సమృద్ధిగా పాలనిచ్చునుగాక యనియు, యజమానుని పశుగణములన్నియు చక్కగా రక్షింపబడవలెననియు బోధింపబడినది. ఇక మనము ఈ మంత్రములో బోధింపబడిన శ్రేష్ఠతమ కర్మ లెవ్వియో తెలిసికొనవలసి యున్నది.

## యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ

శ్రేష్ఠతమ కర్మలనగా మంచికర్మలలో అన్నిటికన్న మంచివి. ఉత్తమోత్తమ కర్మలు (ది బెస్ట్ డీడ్స్) అని చెప్పవచ్చును. మరి ఆ శ్రేష్ఠతమ కర్మలు ఎవ్వి ? అను ప్రశ్న ఉదయించును. దానికి సమాధానముగా శతపథ బ్రాహ్మణమున యాజ్ఞ్యవల్క్య మహర్షి ఈ విధముగా వివరించుచున్నాడు.

'శ్రేష్ఠతమాయ కర్మణే' ఇతి । యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ, యజ్ఞాయ హి తస్మాదాహ శ్రేష్ఠతమాయ కర్మణ ఇతి ॥ (శతపథ. 7-1-5)

'శ్రేష్ఠతమ కర్మ కొరకు' అని చెప్పబడినది. యజ్ఞమే శ్రేష్ఠతమ కర్మయై యున్నది. యజ్ఞముకొరకే యని ఎందుకు చెప్పబడు ననగా శ్రేష్ఠతమ కర్మకొరకు.

దీని భావ మేమన యజ్ఞమునకు శ్రేష్ఠతమ కర్మయని పేరు. శతపథ బ్రాహ్మణమున ఈ ప్రసంగము దర్శేష్ఠి విధానమును గూర్చి వివరించునపుడు వచ్చును. యజ్ఞపదమునకు విశాలమైన అర్థములున్నను ప్రకరణమును బట్టి యిచట అగ్నిహోత్రమునకే యిది వర్తించును.

యజ్ఞ పదము 'యజదేవపూజా సంగతికరణ దానేషు' అను

సంస్కృత ధాతువుతో నిర్మించబడును. అందుచే యజ్ఞ పదమునకు దేవతలను పూజించుట, వ్యక్తులను వస్తువులను సంఘటితపరచుట, దానధర్మములు చేయుట యను మూడు అర్థములు వచ్చును. అందు మొదటిది దేవపూజ. దేవతలను స్థూలముగా చేతన దేవతలు, జడదేవతలు నని రెండుగా విభజించవచ్చును. చేతనదేవత లనగా జ్ఞానముగల దేవతలు. తల్లి తండ్రి ఆచార్యుడు సాధు సంన్యాసులు మొదలగు మనకు మేలు చేయువారంతా చేతన దేవతలుగా గణించవచ్చును. వీరిని తగిన విధంగా ఆహార వస్త్ర ధనసేవాదులతో సత్కరించుట చేతనదేవతలపూజ యగును.

జడదేవత లనగా జ్ఞానములేని దేవతలు. భూమి జలము అగ్ని వాయువు ఆకాశము అను పంచభూతములు జడదేవతలు. వీటికి జ్ఞానము లేకున్నను మనకు మేలు చేయుచుండును. కాన, వీటిని కూడా దేవతలగా పేర్కొనుట మన వేదాది శాస్త్రములలో కాననగును. ఏలనన ఈ పంచభూతములతోనే మన స్థూల శరీరము నిర్మింపబడినది. వీటితోనే పెరిగి పెద్దదై వీటి ఆధారముతోనే మనుగడ సాగించుచున్నది. ఇవి నిరంతరము మనకు మేలు చేయుచునే యున్నవి. కనుక మనము వీటికి ఋణపడి యుంటాము. ఇంతేగాక, మనము భూమినుండి మంచి ఆహారము తీసుకుని సారమును గ్రహించి మిగిలినది మలముగా విసర్జించి భూమిని కలుషితము చేయుదుము. మంచి నీటిని గ్రహించి మూత్ర, స్వేదములుగా విసర్జింతుము. మంచి గాలిని పీల్చుకుని కార్బన్ డై ఆక్సైడ్‌గా వదలిపెట్టుదుము వీటివలన వాతావరణము మలినమగుచుండును. దానిని మరల శుద్ధి చేసుకోవలసిన బాధ్యత మనపై నున్నది. శుద్ధి చేసుకొనకున్న మనము, మన ముందుతరముల వారుకూడా పెక్కు రోగములకు గురియగు ప్రమాద మున్నది. కాన,

ఇది పెద్ద ఋణముగా భావించవలసియుండును. ఈ దేవతల ఋణము తీరవలెనన్న అగ్నిహోత్రముచేయుట యొక్కటియే ఏకైక మార్గము. ఎందుచేతననగా ఈ పంచభూతములలో అగ్నియొక్కటియే నోరుగల (తిని జీర్ణము చేసుకోగల) దేవత. అది జీర్ణము చేసుకొనుటయేగాక మిగిలిన నాలుగు భూతములైన భూ జల వాయు ఆకాశములకు అందజేయగలదు.

మనము నోటి ద్వారా స్వీకరించిన ఆహారము మన జీర్ణకోశములో జీర్ణమై రసముగామారి రక్తముద్వారా శరీరమున కంతటికి అందజేయబడును. అట్లే అగ్నిలో వేసిన పదార్థము సూక్ష్మఅణువులుగా మారి ముందుగా గాలిలో కలియును. తదుపరి మేఘములవరకు చేరి అందలి జలమునకు అందజేయును. ఆ మేఘములు వర్షించినపుడు భూమిని చేరును. కనుక 'అగ్నిర్ వై దేవానాం ముఖమ్' – అగ్ని దేవతలకు ముఖము అనగా నోరు వంటిది యని ఋషులు పరిశోధించి తెలిసికొనిరి. ఇచట అగ్ని యనగా అగ్నిహోత్రము (హోమము) అని గుర్తించాలి. సామాన్య అగ్నివలన ఈ ప్రయోజనం నెరవేరదు. శాస్త్రవిధి ననుసరించి యజ్ఞకుండమును నిర్మించి తగిన సమిధలను తగిన విధముగా పేర్చి, అగ్నిని ఆధానము చేయవలసి యుండును. యుక్తిగా తగిన వ్యవధానముతో నేతిని మరియు మూలికాదులతో తయారుచేసిన హోమ ద్రవ్యములను ఆహుతులుగా నివ్వవలసియుండ్దును. ఆ వ్యవధానమును క్రమబద్ధము చేయుటకు కొన్ని వేదమంత్రములతో మన ఋషులు ఒక విధానమును రూపొందించిరి. ఆ విధిని అనుసరించినపుడే మనము కోరుకున్న ఫలితములు సిద్ధించును. గాలి, నీరు, భూమి శుద్ధమై మనము ఆరోగ్యముగా ఆనందముగా ఉత్సాహముగా మనుగడ సాగించ గలుగుదుము.

విధానమునందు పఠించు మంత్రములలో అగ్నిహోత్రము వలన కలుగు ప్రయోజనములు, ప్రాకృతిక నియమముల వర్ణన, సామాజిక స్పృహ, సమాజముపట్ల తన కర్తవ్యము, తన వ్యక్తిగత ఉన్నతికి అనుసరించవలసిన విధి నిషేధములు మున్నగు అనేకానేక విషయము లున్నవి. అగ్నిహోత్రములో నుపయోగించు వస్తువులు, క్రియలు, విధి విధానములు మరెన్నో విషయములకు అగ్నిహోత్రము ఒక ప్రతీకగా నుండును. వీటిని ముందు పుటలలో వివరముగా తెలిసికొందము.

అగ్నిహోత్రమునకు యజ్ఞమని పేరు. యజ్ఞ మన శ్రేష్ఠతమ కర్మ. పక్షపాతరహితముగా పరులకు ఉపకారము చేయుట. దానికి సంకేతమే అగ్నిహోత్రము. ఎట్లన - అగ్నిహోత్రములో వేసెడి ఆహుతులన్నియు వాతావరణమును శుద్ధిచేసి ప్రాణుల కుపకారము చేయునవియే. ఆ యుపకారముకూడా పక్షపాతరహితముగా అన్ని ప్రాణులకు సమానముగా చేయబడును. మానవులకు, పశుపక్ష్యాదులకు, వృక్షజాతులకు, ప్రాణవాయువును పీల్చుకుని జీవించు ప్రాణులన్నిటికి ఆ యాహుతు లందజేయబడును. అక్కడ పక్షపాతమునకు తావు లేదు. అవి మన మిత్రులకేగాక శత్రువులకుకూడా సమాన ఉపకారము చేస్తాయి.

మనము చేయు దాన ధర్మ పరోపకారాదులుకూడా యజ్ఞములే కాని వాటియందు కొంత స్వార్థము దాగి యుండును. దాన ధర్మ పరోపకారాదులు మనకు అనుకూలముగా నుండువారికే చేయు చుందుము. శత్రువులకు చేయ వెనుకాడుదుము. మనము ఉపకారము చేయువారినుండి కాలాంతరమున మనకు ఏదైనా లాభము కలగగలదని ఆశించుచుందుము. లేదా పేరు ప్రతిష్టలు కలుగు నను లోకేషణ కలిగియుందుము. కాని, అగ్నిహోత్రము ఈ దోషమునకు కూడా

అతీతముగా నుండును. అగ్నికి అర్పించిన దానినుండి మనము ఏమి ఆశించగలము? స్వర్గకాంక్ష యుండునని సందేహమా ? స్వర్గము కల్పిత లోకమే కదా? ఆ భావనకూడా రాకుండుటకు ఆహుతు లిచ్చునపుడు 'స్వాహా' కారము పలికి ఆహుతులివ్వవలె నని మన ఋషుల నిర్దేశం. దీనివలన స్వస్వామిత్వ నివృత్తి కలుగును. అనగా ఈ అహుతినుండి మరల నే నేమియు నాశించుటలేదని యర్థము. ఇంతేగాక, తదుపరి 'ఇదం న మమ' అని పలికింతురు. ఇది నాది కాదు. నేను సృజించినది కాదు. పరమేశ్వరుడు సృజించినదే. ఈశ్వర ప్రదత్తమైన ఈ శరీర యింద్రియ మనో బుద్ధులతో పురుషార్థము చేసి నేను పొందిన దానిలో కొంత భాగమును ఆయనకే అర్పించుచున్నాను. లోక హితమునకే అర్పించుచున్నాను అను భావము ఈ వాక్యమున నున్నది. దీనివలన అహంకార నివృత్తి జరుగును. దీనినే శాస్త్రములు స్వత్వఫాదానము అని పేర్కొనును. ఋషులకు కలిగిన ఈ ఆదర్శ భావము లన్నిటికి వేదమే ఆదిమ స్రోతస్సు. ఇట్టి భావముగల అనేకానే మంత్రములు వేదములందు గలవు.

మనం నిజ జీవితములో ఆచరించవలసిన అనేకానేక కర్మలలో అగ్నిహోత్రము ఆదర్శముగా నుండి మనకు ప్రేరణ నిచ్చుచుండును. మనిషిని దేవతగా మహాత్మునిగా చివరకు మాక్తాత్మగా తీర్చి దిద్దును. అందుచేతనే యాజ్ఞవల్క్య మహర్షి యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ యని నుడివి యున్నాడు. ఇందులో అతిశయోక్తి ఏమున్నది ?

## క్రతు మయః అయం పురుషః

పై శతపథ బ్రాహ్మణ వాక్యము 'క్రతు మయః అయం పురుష' (3-5-3-1) నకు ఈ పురుషుడు క్రతుమయుడు' అని అర్థం. ఇచట పురుష దనగా కేలము మగవాడు అని అర్థం కాదు. స్త్రీ పురుష లిరువురిని పురుష పదముతోనే పేర్కొనుట శాస్త్రములందు కాననగును. జీవుడు శరీర మను పురములో శయనించునుగాన పురుష దను పేరు కలిగెనని శాస్త్రములు చెప్పును. ఇచట పురుష పదమునకు మానవమాత్రుడని అర్థం. క్రతవు అంటే కర్మలు చేయువాడని అర్థం. మానవుడు క్రతుమయుడు అనగా కర్మమయుడు. కర్మలు చేయకుండ మానవుడు ఒక్క క్షణమైన ఉండలేడు. శరీరముతో కర్మలు చేయకున్నను వాక్కుతో చేయును. వాక్కును నియంత్రించి మౌనము పాటించినను మనస్సుతో నేదో ఆలోచించుచునే యుండును. ఆలోచనలను కట్టిపెట్టుట బహుకఠినము. ఆలోచించకుండ నుండుటకన్న ఆలోచించుటయే తేలికగా నుండును. నిద్రకూడా నొక చిత్త వృత్తియే (మనస్సుయొక్క వ్యాపారమే) యని యోగదర్శనము చెప్పును. కాన మానవుడు మానోవాక్కాయము లను త్రికరణములతో నెల్లపుడు నేదో నొక కర్మ చేయుచునే యుండును. అందుచేతనే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో

**"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠతి.అకర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్ గుణైః ॥** (భగవద్గీత 3-5)

ఎవ్వడును ఎప్పుడును కర్మలుచేయకుండా ఒక్క క్షణమైనను నుండలేడు. మానవులందురును వారివారి స్వాభావిక గుణముల మూలమున వివశులై ఏవో కర్మలు చేయుచునే యుందురు" అని నుడివి యున్నాడు.

పరమేశ్వరుడును వేదములందు మానవులను క్రతువు లనియే సంబోధించెను. 'ఓ3మ్ క్రతో స్మర' (యజుర్వేదము 40-15) ఓ క్రతువులారా! (ఓ మానవులారా!) మీరు నన్ను ఓ3మ్ నామముతో స్మరింపుడు అని ఉపదేశించి యుండెను. పరమేశ్వరుని ముఖ్యనామము లేదా నిజనామము ఓ3మ్ అయినట్లే మన నిజనామము (అసలు పేరు) క్రతుః. మనము క్రతవులము. కర్మలు చేయువారము. అందుచేతనే పెద్దలు 'మానవ యోని కర్మయోని' యని అందురు. ఈ జన్మలో చేసిన కర్మలే ధర్మముకాని, అధర్మముకాని యగును. ధర్మకార్యములు పుణ్యమును, అధర్మకార్యములు పాపమును కలిగించును. పుణ్యము వలన సుఖము, పాపమువలన దుఃఖము కలగును ఇది సృష్టి నియమము. కనుక సుఖమును గోరు మనము ధర్మకార్యము లొనర్చి పుణ్యజీవులము కావలెను. ఎంత ఎక్కువగా ధర్మకార్యము. లొనర్చిన అంత ఎక్కువగా సుఖము లభించును. అంత ఉన్నతి కలుగును. పరమేశ్వరుని సందేశముకూడా అదియే.

ఉద్యానం తే పురుష నావయానం
జీవాతుం తే దక్షితాతిం కృణోమి ।
ఆ హి రోహేమమమృతం । సుఖం రథమ్
అథ జిర్విః విదథమా వదాసి ॥ (అథర్వవేదం. 8-1-6)

ఓ మానవుడా ! ధర్మకార్యము లొనర్చి ఉన్నతిని బొందుము. అధర్మమొనర్చి అవనతిని బొందవలదు. నీవు ఉన్నతిని బొందవలెననియే నీకు ఈ జీవితమును, దక్షతను (సామర్థ్యమును) ఇచ్చుచున్నాను. సుఖమును కలిగించు ఈ మానవశరీర రథమును అధిరోహించుము. నీవు ఉన్నతిని బొంది తోటి మానవులకు మార్గదర్శివి కమ్ము. వృద్ధుడవైనను వానప్రస్థ సంన్యాసాశ్రమములు స్వీకరించినను నీ తోటివారికి ధర్మము నుపదేశించుచునే యుండుము.

ఈ ధర్మకార్యములు జీవితాంతం మరణ పర్యంతం చేయుచునే యుండవలెనని వేదము ఆదేశించును.

**కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః ।**
**ఏవం త్వయి నాన్యథే తోఽస్తి న కర్మ లిప్యతే నరే ॥**(యజు.40-2)

ఓ మానవా ! వేదవిహిత నిష్కామ ధర్మకర్మలు చేయుచునే ఈ లోకమున నూరేండ్లు జీవింపగోరుము. కర్మ బంధన హేతువు కాకుండుటకు ఇంతకన్న వేరొక మార్గము లేదు. అనగా క్రతువు శతక్రతువు కావలెను. నూటికి నూరుపాళ్ళు సత్కర్మలనాచరించుచునే నూరేండ్లు జీవింప గోరవలెను.

ఈ వేద ప్రతిపాదిత నిష్కామ కర్మయోగమునే శ్రీకృష్ణుడు భగవద్గీతలో అనేక కోణములలో వివరించి యున్నాడు. ముఖ్యముగా మూడవ అధ్యాయములో ఈ చర్చ కనబడును. శరీరయాత్ర జరుగుటకైనను కర్మచేయక తప్పదనెను.

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీర యాత్రాఽపి చ తే ప్రసిద్ధ్యే దకర్మణః॥** (భగవద్గీత.3-8)

"నీవు నీ వర్ణాశ్రమాలకు తగినట్లు విధించబడిన పంచమహాయజ్ఞ దాన పరోపకారాది ధర్మకార్యములు చేయుచునే యుండుము. కారణ మేమన కర్మత్యాగమునకన్న కర్మాచరణయే గొప్పది. కర్మ చేయకున్న నీ జీవన నిర్వహణకూడా సిద్ధింపదు' అని హెచ్చరించెను. కనుక కర్మలు తప్పక చేయవలెను. కాని, ఆ కర్మలు యజ్ఞభావనతో యజ్ఞము కొరకు చేసినపుడు మాత్రమే మనకు ఉన్నతి కలుగును.

క్రతుః అను పదము 'కృఞ్ - కరణే' అను ధాతువుతో నిర్మితమగును 'కర్మలు చేయువాడు' అని దీని అర్థం. శాస్త్రములలో కర్మకురు అను వాక్యము లెచ్చట వచ్చినను అచట సత్కర్మలనియే

గ్రహించాలి. కనుక క్రతుః అనగా సత్కర్మల నాచరించువాడు అనిఅర్థం. ఆ సత్కర్మలనే యజ్ఞములనికూడా అంటారు. అందుచే 'క్రతు'ః అను పదమునకు 'యజ్ఞము' అను అర్థముకూడా చేర్చబడింది. క్రతుమయుడైన జీవుడు యజ్ఞమయుడు కావలెనని మన ఋషుల యభిమతం. ఇక యజ్ఞ మన నేమో తెలిసికొందము రండు.

## యజ్ఞమయః అయం పురుషః

పై శీర్షికా వాక్యముకూడా శతపథ బ్రాహ్మణము (3-5-3-1) లోనిదే. పురుషుడు అనగా మానవుడు యజ్ఞమయుడు కావలెనని దీని భావం. సత్కర్మలనే ఫలాపేక్షను విడిచి నిష్కామభావనతో చేసినచో అవి యజ్ఞము లగును. లేకున్న సత్కర్మలైనను ఫలాపేక్షతో చేసిన జనన మరణరూప సంసార బంధనమునకు కారణమగును. శరీరముతో ఎన్ని భోగము లనుభవించినను జన్మ జరా వ్యాధి మరణ దుఃఖములనుండి తప్పించు కొనలేము. ఇంతేగాక, భోగములవలన రాగము ఏర్పడును. రాగము ద్వేషమునకు కారణమగును. ఈ రాగద్వేషములచే మనిషి క్రమముగా పాపి యగును. నీచయోనులకు పయనించును. మానవ జన్మను బొంది ఉద్యానం (ఉత్+యానం) పైకి పయనించవలసిన జీవుడు అవయానం క్రిందికి పయనించును. కనుకనే శ్రీకృష్ణుడు

యజ్ఞార్థాత్ కర్మణో௨ న్యత్ర లోకో௨యం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ! ముక్తసంగః సమాచర ॥ (భగవద్గీత.3-9)

యజ్ఞార్థము అనగా లోకహితముకొరకు చేయబడెడు కర్మలు కాక మిగిలిన కర్మలన్నియు జీవుని ఈ లోకమున బంధించును. కనుక ఓ కుంతీపుత్ర ! యజ్ఞముకొరకే - సర్వప్రాణిహితము కొరకే కర్మల నాచరింపుము. అవికూడా ముక్త సంగుడవై ఫలకాంక్ష రహితుడవై

ఆచరింపుము. అట్లని మ్రొక్కుబడిగా కర్మలను ఆచరించవద్దు. సమాచర-చక్కగా నీపూర్ణ శక్తిసామర్థ్యములను వినియోగించి యజ్ఞకర్మల నాచరింపుమని హెచ్చరించెను.

శతపథ బ్రాహ్మణము యజ్ఞమే పురుషు డనియు, యజ్ఞమును అతడు ఎంతగా విస్తరింపజేయునో అంతగా తాను విస్తరించుననియు చెప్పును.

**పురుషో వై యజ్ఞః। పురుషస్తేన యజ్ఞో యదేనం పురుషస్తనుత ఽఏష వై తాయమానో యావానేవ పురుష - స్తావాన్ విధీయతే తస్మాత్పురుషో యజ్ఞః॥ (శత. బ్రా. 1-3-2-1)**

కనుక యజ్ఞము మన ఉన్నతికొరకే, మన వికాసము కొరకే నని గ్రహించాలి.

ఇచట మనము యజ్ఞము యొక్క మౌళిక అర్థమేమిటో తెలిసికొనవలసియున్నది. పాణిని మహర్షి సమాధిస్థుడై వేదపదములలోని మౌళికార్థములను పరమేశ్వరుని ద్వారా తెలిసికొని ధాతుపాఠ మను గ్రంథమును రూపొందించెను. అందు 'యజ్ఞ' ధాతువునకు మూడు అర్థములు చెప్పబడినవి. అవి దేవపూజ సంగతికరణ దానములు. కనుక, ఏ కర్మలైనను యజ్ఞములు కావలెనన్న పై మూడింటిని కలిగియుండవలెను. ఈ మూడును కలిగిన కర్మ తప్పక శ్రేష్ఠతమ కర్మ యగును. కనుకనే 'యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ' అని చెప్పబడింది.

దేవపూజ సంగతికరణ దానములు మూడును వేరువేరుగా కనబడుచున్నను ఇవి ఒకదానితో నొకటి సంబంధము కలిగియున్నవి. మొదటి అర్థము దేవపూజ. అనగా దేవతలను పూజించుట. మరి దేవతలు ఎవరు ? అను ప్రశ్న ఉదయించును. దానికి యాస్కమహర్షి 'దేవో

దానాత్' దానశీలత కలిగినవారే దేవతలు అని సమాధానము చెప్పెను. అట్లే పూజా అను అర్థములో కూడా దానశీలత దాగియున్నది. పూజించువాడు కూడా తనదైన దానిని కొంత సమర్పణము (దానము) చేయును కదా ! కనుక దాన ఆదానములు ఎచ్చటనుండునో అది దేవపూజ. ఈ దేవపూజ దానములు సంగతికరణముపై ఆధారపడి యున్నవి. ఏలనన సంగతికరణము అనగా సమీకరించుట, ప్రోగు చేయుట అని యర్థము. పూజా సామగ్రిని. నెయ్యి, సమిధలు, హోమ ద్రవ్యములు మొదలైన వాటిని సమీకరించినపుడు మాత్రమే కదా దేవపూజ, దాన ఆదానములు జరుగును. అగ్నిహోత్రములో దేవపూజతోబాటు సంగతికరణ, దానములు ఇమిడి యున్నవి. కనుక అగ్నిహోత్రమును యజ్ఞము అని పేర్కొనుట జరుగుచున్నది.

శ్రీ స్వామి దీక్షానంద సరస్వతిగారు పై భాగమును ఒక సంహితా పాఠముగా రూపొందించిరా. అది ఏమన - "దేవః పూర్వరూపమ్ । పూజనమ్ ఉత్తరరూపమ్ । దానం సన్ధిః । సంగతికరణం సన్ధానమ్ । ఇత్యధియజ్ఞమ్ ।

అగ్నిహోత్రమును యజ్ఞ మనుటకు శతపథబ్రాహ్మణమున అగ్నిర్ వై యజ్ఞః, అగ్నిర్ వై యజ్ఞస్య అనరార్ధ్యో, అగ్నిర్వై యోనిర్యజ్ఞస్య, అగ్నిర్వై హోతా, అగ్నిర్ వై సర్వాదేవతా, అగ్నౌ హి సర్వేభ్యో దేవతాభ్యో జుహ్వోతి మొదలగు అనేక ప్రమాణములు కనబడును.

పైన వివరించినట్లు దేవపూజా సంగతికరణ దానము లను మూడు గుణములు కలిగియుండుటచే అగ్నిహోత్రము యజ్ఞ మను పేరుతో ప్రసిద్ధిని బొందినది. ఒకవేళ ఈ త్రిగుణములు వ్యక్తిలో దృష్టిగోచరమైన ఆ వ్యక్తి యజ్ఞరూపు డగును. పరివారములో గోచరించిన ఆ పరివారము

యజ్ఞరూప మగును. సమాజములో గోచరించిన ఆ సమాజము, రాష్ట్రములో గోచరించిన ఆ రాష్ట్రము యజ్ఞరూప మగును. సూక్ష్మదృష్టితో పరిశీలించిన ఈశ్వరునిచే సృజింపబడిన ఈ బ్రహ్మాండములోని ప్రతి క్రియలోను పై త్రిగుణముల సమన్వయ మున్నది. అందుచే ఈ బ్రహ్మాండమును యజ్ఞముగా వర్ణింతురు. ఈ సృష్టిరూప యజ్ఞమునకు కర్త పరమేశ్వరుడు.

పై త్రిగుణములు బ్రహ్మాండములో గోచరించునట్లే ఈ మానవ శరీరమునందును గోచరించును. శరీరములోని ప్రతి చిన్న శక్తి తనకన్న పెద్ద శక్తిని పూజించు చుండును. ఇంద్రియములన్నియు తమ రాజు అయిన ఇంద్రుని (జీవుని) పూజ చేయుటలో నిమగ్నమై యుండును. అవి తాము తీసుకువచ్చిన విషయములను జీవునకు బహుమతిగా (దానముగా) అర్పించు చుండును. దానికి బదులుగా దేవతయైన జీవుడు ఆ యింద్రియములకు తన శక్తిని ప్రదానము చేయుచుండును. దాన ఆదానములు జరుగును. ఈ దాన ఆదానములు సంగతికరణముపై ఆధారపడి యుండును. ఉదాహరణకు మానవుని ఎదుటకు భోజన పదార్థములతో కూడిన ఒక పళ్ళెరము వచ్చినచో ముందు నేత్రములు వాటిని చూచి గ్రహించి తగినవే నని మెదడునకు తెలుపును. అప్పుడు మెదడు తీసుకోమని చేతికి ఆదేశ మిచ్చును. చేతితో గ్రహించ యత్నించినపుడు అవి వేడిగా నున్నచో స్పర్శేంద్రియము కొద్దిసేపు అగుమని హెచ్చరించును. అట్లు హెచ్చరించకున్న నోరు కాలును. వేడి తగ్గిన తదుపరి చేయి తీసుకుని నోటికి అందించును. ఒకవేళ ఆ పదార్థము చెడిపోయినదైనచో ముక్కులోని ఘ్రాణేంద్రియము దానిని గుర్తించి తినవద్దని హెచ్చరించును. అట్లు హెచ్చరించకున్న తిని వాంతి

చేసుకోవలసి వచ్చును. అంతకుపూర్వము తిన్నదికూడా వాంతి యగును. నోరుకూడా దేవతయే. తనకు అందినదానిని బాగా నమిలి లాలాజలమును కూడా జోడించి కడుపునకు అందజేయును. తనవద్ద ఏమియు నుంచుకొనదు. గ్రహించినది యిచ్చుటకే. కడుపును దేవతయే. అది తనలోని జీర్ణ రసములతో ఆ యాహారమును పచనము చేసి రసముగా మార్చి రక్తమున కందించును. రక్తము ద్వారా శరీరములోని ప్రతి కణమునకు ఆ ఆహారసారము చేరును. ఈ విధముగా మన శరీరములో ఇంద్రియములు, అవయములు, మనస్సు, బుద్ధి, జీవాత్మ యివియన్నియు సమన్వయముగా ఆదాన ప్రదానములు చేసుకొనుచు ఒకదాని నొకటి సేవించుచుండును. అందుచేతనే శతపథ బ్రాహ్మణము (1-3-2-1) 'పురుషో వై యజ్ఞః' అని చెప్పును. ఛాందోగ్యోపనిషత్తు 'పురుషో వావ యజ్ఞః' అని తెలుపును.

## అగ్నిహోత్రము ఒక పాఠశాల

యజమాని (వ్యక్తి) నిత్యము అగ్నిహోత్రము చేయుచు యజ్ఞమయ జీవితం గడుపుటకు అభ్యాసము చేయుచుండును. దేవతలను పూజించుచు తాను దేవతయగుటకు ప్రయత్నించును. ఇచట దేవతకు, పూజకునకు గల భేదమేమిటో తెలిసికొనవలసి యున్నది. వీరిద్దరు దానము చేయువారే. అయితే వీరిద్దరిలో భేదమెందుకు ? ఒకడు పూజచేయు చున్నాడు, మరియొకడు పూజ నందుకొనుచున్నాడు. పూజనందుకొను దేవతయే గొప్పవా డెందుకగుచున్నాడు ? అను ప్రశ్న ఉదయించును.

పూజకుడు తన కష్టార్జితము నుండి కొంత దేవతలకు దానము చేయును. దేవతలు ఆ దానమును తమవద్ద పెట్టుకొనక మరికొంత చేర్చి తిరిగి పూజకునకే యిచ్చివేయుదురు. అయినను వీరిద్దరిలోను భేద

మున్నది. దీనికి కారణం వీరిద్దరి దానప్రవృత్తిలోను భేద ముండుట వలననే.

పూజకుడు (అగ్నిహోత్రము చేయువాడు) ఆహుతులను దేవతలకు అర్పించును. కాని, ప్రతిఫలము నాశించును. ఈ ఆహుతుల వలన వాతావరణము, భూ జలములు శుద్ధమై తన కనుకూలము కావలెనని కోరుకొనును. సమయమునకు వర్షములు పడి పంటలు పుష్కలముగా పండవలె నని ఆశించును. ఈ దానము కామనతో కూడియున్నది. దేవతలు పూజకుని దానము నందుకొన్నను అది వారికొరకు కాదు. తిరగి పూజకునకు యిచ్చుట కొరకే. పూజకుని దానము తిరిగి తీసికొనుటకు. దేవత ఆదానము (దానగ్రహణము) తిరిగి యిచ్చుటకు (ఆదానం హి విసర్గాయ). దేవత చేయునది నిష్కామ కర్మ. పూజకుడు చేయునది కామ్యకర్మ. కనుక దేవత పూజింపబడుచుండును. పూజకుడు పూజించుచుండును.

వ్యక్తి నిత్యము అగ్నిహోత్రము చేయుచు – దేవతల నుపాసించుచు దేవతాగుణములను తనలోనికి స్వీకరించ ప్రయత్నించును. నిష్కామకర్మ చేయ సంకల్పించును. అగ్నిహోత్రమునుండి ప్రేరణ బొందును. 'ఇదం న మమ' కా సార్థక్, ప్రత్యేక్ మే వ్యవహార హో అని పాడుచు తన జీవనయాత్రలోని ప్రతి వ్యవహారము నందును 'ఇది నాదు కాదు' అను భావమును కలిగియుండును. లోకహితముకొరకు సత్కర్మలు చేయుచు, కర్మ ఫలమును పరమేశ్వరున కర్పించును. నిష్కామ కర్మయోగియై పరమానందము పొందును.

## అగ్నిహోత్ర పాఠశాల ఎంతవరకు ?

మానవుడు యజ్ఞతత్త్వాన్ని చక్కగా అర్థం చేసుకొని దానిని తన నిజజీవితంలో ఆచరించవలసి యుండును. అంతవరకు అగ్నిహోత్ర పాఠశాల అవసరమే. జీవుడు బుద్ధి వికాసముగల ఉత్తమ మానవ శరీరమును బొందినను అవిద్యాబంధము ఉండియే యుండును. ఈ అవిద్యాబంధనము వలన ముందుగా దేహాత్మభ్రాంతి అనగా దేహమే నేను అను భావన కలుగును. దానితో ఈ శరీరముతో ఏర్పడిన అనిత్యమైన ప్రాపంచిక బంధనము లన్నిటిని నిత్యమని భావించును. వాటిని సురక్షితముగా కాపడుకొనుటకు, వృద్ధిచేసుకొనుటకు నిరంతరము శ్రమించును.

పూర్వ మానవ జన్మలలో చేసిన సుకృతముల ఫలముగాను, ఈ జన్మలో చేసిన సాధన ఫలముగాను పరమేశ్వరునిచే ప్రసాదింపబడిన భోగములన్నిటికి తానే కర్తగా భావించును. అహంకారము కలిగి యుండును. తన స్వస్వరూపమును అనగా జీవుడైన తన యథార్థస్వరూపమును మరచి దేహమే తా ననియు, ఈ దేహ సంబంధికులే తనవా రనియు భావించును. తనకొరకు తనవారికొరకు శ్రమించును. – కాని పరోపకారము చేయ మనసొప్పదు.

మానవుని ఈ సంకుచిత భావములనుండి తప్పించి విశాల హృదయుని చేయుటకే అగ్నిహోత్రము రూపొందించబడినది. ఏ విధముగా అగ్నిదేవత తనకు లభించిన ఆహుతులను తనవద్దనే పెట్టుకొనక వాయువులో కలిపి ప్రాణులన్నిటికి పంచిపెట్టునో అట్లే మానవుడు తనకు లభించిన వాటిని తన తోటి ప్రాణులకొరకు త్యాగము చేయవలసి యుండును. అప్పుడే అతడు దేవత యగును. కనుక మానవుడు దేవత యగువరకు అగ్నిహోత్రము అవసరమే.

మానవుడు బ్రహ్మచర్యాశ్రమున అగ్నిహోత్రము చేయుచు పై విశాల భావబీజములను తన హృదయమున నాటుకొనుటకు ప్రయత్నించును. గృహస్థాశ్రమమున వాటిని మొలకలెత్తించి పంచ మహాయజ్ఞములను నిష్ఠతో చేయును. క్రమముగా అవి పెరిగి పెద్దవై చెట్లగును. వానప్రస్థాశ్రమమున అగ్నిహోత్రము చేయుచు ఆ చెట్ల నీడలో మరెందరికో ఆశ్రయము కల్పించును. కొందరు బ్రహ్మచారుల హృదయములలో ఆ చెట్ల బీజములను నాటును. అగ్నిహోత్ర పాఠమును పూర్తిగా హృదయంగమము చేసుకొనును. సంన్యాసాశ్రమమున బాహ్యముగానున్న అగ్నిహోత్రమును తన హృదయమున ప్రతిష్ఠించుకొని అగ్నిహోత్ర స్వరూపుడగును. అందుచేతనే అగ్నిరంగుతోనున్న కాషాయ వస్త్రములను ధరించును. లోకసంచారము చేయుచు ధర్మోపదేశము చేయును.

శతపథబ్రాహ్మణ కర్త ఈ అగ్నిహోత్రమును 'జరామర్యసత్ర' మనును. అనగా జరా మృత్యు పర్యంతము చేయవలె నను.

**ఏతద్వై జరామర్యసత్రం యదగ్నిహోత్రం జరయా వా**
**హ్యేవాస్మాన్ ముచ్యతే మృత్యునా వా ।**

**(శతపథ బ్రాహ్మణము-12-4-1-1)**

ఈ అగ్నిహోత్రమే జరామర్య సత్రము. ఈ బంధము ఎంతవరకు ఉండునన - జరావస్థనుబొంది సంన్యాసాశ్రమము స్వీకరించునంతవరకు లేదా మృత్యువును బొందునంత వరకు.

జరావస్థలో (సంన్యాసాశ్రమములో) అగ్నిహోత్రమును తన ఆత్మలో స్థాపించుకొనును. లేకున్న మృత్యువును బొంది తన శరీరమును అగ్నికి అర్పించుకొనును. ఒకడు (సంన్యాసి) జీవించి ఉండగానే అగ్నిని తన ఆత్మలో ధరించి అగ్నిరూపుడగును. జీవన్ముక్తుడగును. మరియొకడు

(సామాన్య మానవుడు) మరణించి వివశతతో అగ్నికి అర్పింపబడును. కనుక పూర్ణపురుషార్థము చేయుచు అగ్నిహోత్ర ఆదర్శమును ఆత్మలో స్థాపించుకొనవలెను. అంతవరకు అగ్నిహోత్రము చేయక తప్పదు.

## అగ్నిహోత్రములోని ఆదర్శం

అగ్నిహోత్రము యజ్ఞపదములోగల దేవపూజ, సంగతికరణ, దానము లను త్రివిధ తత్త్వములను తెలుపునని యింతకుపూర్వము తెలిసికొని యుంటిమి. ఆ తత్త్వములు ఏ రూపములో నున్నవో పరిశీలింతము. అగ్నిహోత్రములో దేవత అగ్ని. దాని పూజ యాజకుడు (యజ్ఞకర్త) చేయును. ఆజ్యము (నెయ్యి) దాన స్థానమున నుండును. సమిధలు సంగతికరణమునకు ప్రతీకగా నుండును. మనము జాగ్రత్తగా పరిశీలించిన అగ్నిదేవత తనకు అర్పించిన వాటిని వెయ్యిరెట్లు ప్రయోజనకరముగా మార్చి వాయురూపమున మనకందించుచున్నది. దీనితోపాటు చక్కటి ప్రకాశమును తాపమును (ఉష్ణమును) కూడా యిచ్చు చున్నది. హవ్యద్రవ్యములోని మంచి చెడులను విభజించి మంచి వాటిని పరమాణువులగాను, చెడును దహించి ప్రకాశముగాను మార్చుచున్నది. ఈ ప్రకాశ తాపములుకూడా వాతావరణ సమతుల్యతకు అవసరములే. ప్రకాశము జ్ఞానమునకు సంకేతము. తాపము స్ఫూర్తికి సంకేతము. ఇవి మనకు జ్ఞానముతో ప్రకాశించవలెననియు, స్ఫూర్తితో (ఉత్సాహముతో) లోకహిత కార్యములు చేపట్టవలెననియు సందేశము నిచ్చుచున్నవి. యజ్ఞకర్త వీటన్నిటిని గ్రహించును. వాటిని తన జీవనమున అలవరచుకొన యత్నించును.

గమనించవలసిన మరియొక ముఖ్య విషయ మేమన సంగతికరణమునకు ప్రతీక సమిధ. ఈ రెండు పదములలోను 'సమ్'

అను ఒకే ఉపసర్గ ఉన్నది. అది మనకు మరికొన్ని విషయములను తెలుపును. ఆజ్యమును అగ్నిగా మార్చుటకు లేదా ఆజ్యమును అగ్నిని కలుపుటకు సమిధ సాధనముగా నుండును. యజ్ఞకర్త సమిధల మాద్యముననే తను అర్పించు ఆహుతులను అగ్నిదేవత వరకు చేర్చగలగును. అగ్నిదేవత ఆ యాహుతిని సూక్ష్మముగా చేసి మరల యజ్ఞకర్తకు అందించుటకును సమిధయే మాధ్యమముగా నుండును. సమిధ పదము 'ఇన్ధీ దీప్తౌ' ధాతువుతోను, ఘృత పదము 'ఘృ క్షరణ దీప్తయోః' అను ధాతువుతోను నిర్మితమగును. సమిధా ఘృతముల దీప్తి అగ్నియొక్క సంగతికరణమువలన కలుగగా అగ్నియొక్క దీప్తి మరియు వృద్ధి సమిధా ఘృతములపై ఆధారపడి యున్నది. కనుక ముఖ్య ఆదర్శము సంగతికరణము - సంఘటన - కలయిక అని గుర్తించాలి.

పరమేశ్వరుడు అగ్నిహోత్రము ఎటుల చేయవలెనో తెలుపుచు
సమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధయత + అతిథిమ్ ।
ఆస్మిన్ హవ్యా జుహోతన । (యజుర్వేదము. 3-1)

ఓ మానవులారా ! సమిధలతో అగ్నిని చక్కగా జ్వలింపజేయుడు. ఘృతముతో దానిని వృద్ధిపొందించుడు. ఆ వృద్ధి చెందిన అగ్నిహోత్రములో మూలికలను, స్థాలిపాక మిష్టాన్నములను పద్ధతి ప్రకారము చక్కగా ఆహుతులుగా నర్పించుడు. ఈ క్రియలు చేయునపుడు అతిథులను (తామువచ్చు తిథిని తెలుపకనే దేశసంచారము చేయుచు ధర్మోపదేశము చేయు విద్వాంసులైన సాధు సంన్యాసులను) సేవించుటనట్లు శ్రద్ధాభక్తులతో సేవింపుడు" అని ఉపదేశించెను. ఏలనన జ్ఞానముగల అతిథులు మనకు ధర్మోపదేశము చేయునట్లే అగ్నిహోత్రము మనకు మౌనముగా ధర్మోపదేశము చేస్తుంది.

పై మంత్రములోని రెండవ పాదములో పరమేశ్వరుడు "ఆస్మిన్ హవ్యా జుహోతన - (అస్మిన్) ఈ అగ్నిహోత్రములో (హవ్యా) = హవ్యములను (ఆ జుహోతన) చక్కగా హోమము చేయుడు" అని ఉపదేశించుచున్నాడు. ఈ వాక్యములోని 'హవి' పదము మనకు ఏ సందేశ మిచ్చుచున్నదో పరిశీలింతము. హవి పదము "హు - దాన + అదనయోః ఆదానే చ" అను ధాతువుతో నిర్మింపబడును. అందుచే ఈ పదమునకు ఇచ్చుట, తినుట, తీసికొనుట అను మూడు అర్థము లున్నవి. దీనినిబట్టి ఏ వస్తువు ఇవ్వబడుతుందో, తీసికొనబడుతుందో మరియు తినబడుతుందో దానిని హవ్యము అనవచ్చును. హవిస్సు యజ్ఞకర్తచే ఇవ్వబడుతుంది - మరల తీసికొనుటకు ; అగ్నిదేవత హవిస్సును తీసికొంటుంది - తిరిగి యిచ్చుటకు. ఈ దాన ఆదానములు అదనపముపై అనగా తినుటపై ఆధారపడి యుండును. ఇచట గమనించవలసినది ఏమనగా యజ్ఞకర్త హవిస్సును యిచ్చి మరల తీసికొన నిచ్ఛగించును. అయితే ఏ రూపములో హవిస్సును ఇచ్చుచున్నాడో మరల అదే రూపములో యథాతథముగా తీసికొన నిచ్ఛగించుట లేదు. సహస్రాదిక గుణము గలిగిన పరమాణవుల రూపములో తిరిగి పొందగోరుచున్నాడు. ఆ రకముగా రూపొందింపవలెనన్న అగ్ని దానిని తిని జీర్ణముచేసి (అణువులుగా మార్చి) యివ్వవలసియుండును. కనుక అగ్నిదేవత యజ్ఞకర్త అర్పించిన దానమును ఆదానము చేసి (తీసికొని) అదనము చేసి (తిని) జీర్ణము చేసి తిరిగి యజ్ఞకర్తకు దానము చేయును.

ఈ భావమును తైత్తరీయ ఉపనిషత్తు శైలిలో చెప్పవలెనన్న - దానం పూర్వరూపమ్, ఆదానం ఉత్తరరూపమ్, అదనం సంధిః హవిస్సన్ధానమ్, ఇత్యధిహోత్రమ్ । అగును.

'హు' ధాతువులోని పై మూడు అర్థములు అగ్నిహోత్రములో అగ్ని, సమిధా మరియు ఆజ్యములద్వారా తెలియబడును. ఏ విధముగా యజ్ఞకర్త అగ్నిమాధ్యమమున దేవతలను పూజించునో, ఘృత మాధ్యమముగా దానము చేయునో, సమిధల మాధ్యమమున సంగతికరణము నేర్చుకొనునో అట్లే ఘృత మాధ్యమమున దానమును అగ్ని మాధ్యమమున ఆదానమును, సమిధల మాధ్యమమున అదనమును దర్శించి వాటిని అనుసరించ యత్నించును. మన ప్రాచీన ఋషులు యజ్ఞములోని ఈ దాన ఆదాన అదనములను ప్రతిరోజు యజ్ఞకర్త దర్శించవలెననియే యజ్ఞమునకు 'హోత్రము' అని పేరిడిరి. దానినే మనము హోమము అనుచున్నాము. ఈ హోత్రమునకు అగ్నితో సంబంధమున్నది. గాన 'అగ్నిహోత్రము' అను పేరు ప్రసిద్ధిని బొందనది. అప్పుడు ఉపనిషత్ శైలిలో - ఆజ్యం పూర్వరూపమ్ । హవిః ఉత్తర రూపమ్ । సమిత్ సన్ధిః । అగ్నిః సన్ధానమ్, ఇత్యధ్యగ్ని హోత్రమ్ ॥ అవుతుంది.

## ప్రతీకలు - ప్రత్యాయనీయములను తెలుపును

ప్రతీక, ప్రత్యాయనీయ పదములు రెండును పారిభాషక పదములు. ప్రతీక అనగా అంగము అని సామన్య అర్థం. కాని, శాస్త్రములలో ప్రకరణమునుబట్టి ప్రతీక పదమునకు చిహ్నము, గుర్తు, ఉపమానము అను అర్థములు వచ్చును. కవులు కళాకారులు తమ తమ భావములను కవితల ద్వారా, చిత్రములద్వారా తెలియపరతురు. వారి ఆ కాల్పనిక భావముల వెనుక ఒక సందేశ ముండును. పరమకవి పరమేశ్వరుడుకూడా తన అమర కావ్యమైన వేదములలో ప్రతీకల ద్వారానే (ఉపమానముల ద్వారానే) మానవులకు తన సందేశము నిచ్చెను. ఉదాహరణకు -

'స్వస్తి పంథా మనుచరేమ సూర్యాచంద్రమసా వివ'

(ఋ. 5-51-15)

సూర్యచంద్రులవలె మీరు స్వస్తి మార్గము ననుసరింపుడు.

'అన్యో౽న్య మభిహర్యత జాతం వత్సమివాఘ్న్యా

(అ. 3-30-1)

నవజాత వత్సమును (దూడను) గోవు ప్రేమించునట్లు మీరు ఒండొరులను ప్రేమించుడు – ఆదరించుడు.

ఇచట సూర్య చంద్రులు, గో వత్సములు ప్రతీకలుగా నున్నవి. ఆ ప్రతీకలలోని సందేశమును గ్రహించి ఆ విధముగా జీవనము గడపుటనే ప్రత్యాయనీయ మందురు.

లౌకిక ప్రతీకలు (గుర్తులు) కూడా యిట్లే యుండును. న్యాయాలయములో ఒక సున్నితపు త్రాసు దండము ఎటువైపునకు వంగక సమానముగా నుండునట్లు చిత్రము ఉండును. ఇది అచట సరియైన న్యాయము జరుగగలదని సూచించును. మన జాతీయ పతాకముపై త్రివర్ణములు, మధ్యలో అశోకచక్రము ఉండును. ఇవి మన దేశ ఆదర్శములను తెలుపును. కాషాయరంగు త్యాగమునకు, తెలుపు శాంతికి, ఆకుపచ్చ సస్యశ్యామలతకు, అశోకచక్రము ధర్మమునకు ప్రతీకలుగా నున్నవి. అట్లే, కమ్యూనిష్టుల జెండాపై సుత్తి , కొడవలి యుండును. ఇవి కార్మిక కర్షక సంక్షేమమునకు ప్రతీకలు. ఈ ప్రతీకలు ఏ విషయమును తెలుపుచున్నవో దానిని గ్రహించుటయే ప్రత్యాయనీయము. ప్రతీకలే మనకు ప్రత్యక్షమగు చుండును (కనబడుచుండును). ప్రత్యాయనీయములు కనబడవు (అదృశ్యములుగా నుండును). కనుక వాటిని ఊహించి తెలుసుకోవలసి యుండును.

శతపథబ్రాహ్మణ శైలికూడా యిట్లే యుండును. ప్రతీకలు మాత్రమే ప్రత్యక్షమగుచుండును. ఆలోచించి ప్రత్యాయనీయములను అనగా ప్రతీకలు మనకు అందించు సందేశములను గ్రహించవలసి యుండును. శతపథబ్రాహ్మణము ననుసరించి అగ్ని ప్రతీకము - శ్రద్ధ ప్రత్యాయనీయము. ఆజ్యము (నెయ్యి) ప్రతీకము - సత్యము ప్రత్యాయనీయము.

దీనినిబట్టి అగ్నిహోత్రము ద్వారా మనము గ్రహించవలసిన ఆధ్యాత్మికార్థ మేమన - శ్రద్ధ యనెడు అగ్నిలో సత్య మను ఆజ్యమును ఆహుతిగా నర్పించవలె నని గ్రహించాలి.

ఈ విషయము జనక మహారాజునకు - మహర్షి యాజ్ఞవల్క్యునకు జరిగిన సంవాద కథ ద్వారా మరింత స్పష్టమగును.

ఒకసారి జనక మహారాజు యాజ్ఞవల్క్యమహర్షి నుద్దేశించి "వేత్థాగ్నిహోత్రం యజ్ఞావల్క్య?- ఓ యాజ్ఞవల్క్య మహర్షీ! మీకు అగ్నిహోత్ర మన నేమియో తెలియునా ?" అని అడిగెను. దానికి ఆ మహర్షి "వేద సమ్రాట్" ఓ రాజా ! నాకు తెలియును" అని గంభీరముగా సమాధానము చెప్పెను. ఆ సంవాదము ఈ క్రింది విధముగా సాగెను.

జనకుడు : కిమితి ? అయితే అది ఏమిటో చెప్పుము ?

యాజ్ఞవల్క్యుడు : - పయ ఏవేతి - పాలు మాత్రమే.

ఈ సమాధానము మీకు వింత గొల్పును. కాని, దాని వెనుక చాలా గంభీరమైన అర్థము గలదు. ఈ ప్రసంగము ఇంతటితోనే ఆగలేదు. ఇంకను ఇట్లు కొనసాగినది.

జనకుడు : యత్ పయో న స్యాత్ తర్హి కేన జుహుయా ఇతి?

ఒకవేళ పాలు దొరకకున్న దేనితో హోమము చేయవలెను?

యాజ్ఞవల్క్యుడు : వ్రీహి యవాభ్యామ్

పాలు దొరకకున్న వ్రీహి, యవలతో (బియ్యము, గోధములతో) చేయవచ్చును.

ఇచట గమనించవలసినది ఏమియన యాజ్ఞవల్క్యుడు (అలబ్ధప్రతినిధిగా) రూపమును మార్చుచున్నాడేకాని పదార్థమును మార్చుటలేదు. హోమద్రవ్యము దుగ్ధరూపముగానే యుండవలెను. పాలు నాలుగుకాళ్ళ గోవునుండి లభించు పాలు. అట్లే పృథివీరూప గోవునుండి లభించు పాలు బియ్యము, యవలు. అవికూడా లేతగా నున్నపుడు పాలవలెనే యుండును. ముదిరిన తదుపరి గట్టిపడును. అంతట

జనకుడు:యత్ వ్రీహి యవౌ న స్యాతాం తర్హి కేన జుహుయః?

ఏ కారణము చేతనైనా బియ్యము, గోధుమలు దొరకకున్న మరిదేనితో హోమము చేయవలెను ?

ఋషి : యా అన్యా ఓషధయః

అవి దొరకకున్న మరి ఏ యితర కాయధాన్యములతో నైనా లేదా పప్పుధాన్యములతోనైనా చేయవచ్చును.

జనకుడు : యదన్యా ఓషధయో నస్యుః తర్హి కేన జుహుయాః?

మరి యితర ధ్యానములుకూడా లభించనచో దేనితో అగ్నిహోత్రము చేయవలెను ?

ఋషి : యా ఆరణ్యా ఓషధయః స్యుః

ఏ యితర ధాన్యములు దొరకకున్న ఆరణ్యఓషధులతో చేయవచ్చును. (అరణ్యములలో దొరకు వెదురు బియ్యం మొదలగునవి కావచ్చును)

ఇక్కడ ఋషి యభిప్రాయ మేమన లేతగా నున్నపుడు పాలు రూపములో నుండునవి ఏవి అయినప్పటికి హోమద్రవ్యములుగా గ్రహించవచ్చు నని. జనకుడు ప్రసంగమును అంతటితో ఆపలేదు.

జనకుడు : యదారణ్యా ఓషధయో న స్యుః తర్హి ?

ఆ యారణ్య ఓషధులుకూడా లభించనపుడు మరి దేనితో చేయవలెను ?

యాజ్ఞావల్క్యుడు : వానస్పత్యేన

వనస్పతులతో చేయవచ్చును. లోకమున ఓషధు లనగా మందు లనియు, వనస్పతులనగా వనమూలికలనియు భావింపబడును. కాని, శాస్త్రములలో ఓషధు లనగా ఒక పంటనిచ్చి ఎండిపోవునవి. కావున, వరి, గోధుమ, జొన్న మొదలగు కాయధాన్యములు; కందులు, పెసలు, మినుములు మొదలగు పప్పుధాన్యములు ఓషధులని గ్రహించవలెను. శాస్త్రములలో వనస్పతు లన పుష్పించకనే కాయలు కాయునవి. మేడి, అత్తి, పిప్పళ్ళు మొదలగునవి.

ఒకవేళ ఓషధులు కూడా లభించకున్నచో వనస్పతులతో అగ్నిహోత్రము చేవచ్చును. వేదముకూడా దీనిని అంగీకరించును.

యదగ్నే కానికాని చిదా తే దారుణిం దధ్మసి ।
సర్వం తదస్తు తే ఘృతం తజ్జుషస్వ యవిష్ఠ ॥

(యజుర్వేదము. 11-73)

"ఓ యగ్నీ! నీవు యవిష్ఠవు - పదార్థములను అణువులుగా విడదీయుటలో అన్నిటికన్న బలశాలవి. మేము మాకు లభించిన ఏప పదార్థములను నీ ఒడిలో ఉంచుచున్నామో (హోమము చేయుచున్నామో) వాటిని కూడా ఘృతమును సూక్ష్మ అణువులుగా మార్చి గాలిలో కలుపునట్లే

సూక్ష్మము చేసి గాలిలో కలుపుము". ఇట్టి భావము గల మంత్రములు అచ్చటచ్చట కనబడును.

జనక మహారాజు యొక్క జిజ్ఞాస యింకను తీరలేదు. మరల **యధ్వానస్పత్యం న స్యాత్ తర్హి కేన జుహుయాః ?**

ఒకవేళ వనస్పతులు గాని, వాటి పండ్లు గాని లభించకున్నచో దేనితో హోమము చేయవలెను ? అని ప్రశ్నించెను.

యాజ్ఞవల్క్యుడు : "అద్భ్యః - నీటితో చేవచ్చును" అని చాలా సహజముగా జవాబు చెప్పెను. అప్పటికిని జనకుని జిజ్ఞాస శాంతించలేదు. మరల ప్రశ్నించెను. యద్ ఆపో న స్యుః తర్హి కేన జుహుయాః ఏ కారణముచేతనైనా నీరు కూడా లభించకున్న మరి దేనితో హోమము చేయవలెను.

ఈ ప్రశ్నకుకూడా మహర్షి యాజ్ఞవల్క్యుడు విచలితుడు కాలేదు.

**ఆహుయతైవ సత్యం శ్రద్ధాయామ్ । శ్రద్ధా అగ్నిః సత్యమ్ ఆజ్యమ్।**

ఓ రాజా! జలము లభింపకున్నను చింతిపపనిలేదు. శ్రద్ధారూప అగ్నిలో సత్యరూప ఆజ్యమును అర్పించుచు అగ్నిహోత్రము చేయవచ్చును.

పై సంవాదమును పరిశీలించినచో అగ్నిహోత్రములోని మూల తత్త్వము బోధపడును. అగ్నిహోత్రములో అగ్ని శ్రద్ధకు ప్రతీక. ఘృతము (నెయ్యి) సత్యమునకు ప్రతీక.

అగ్నిహోత్రములో హోమము చేయతగినవి పాలు మాత్రమే. దీనిలో వికల్పము లేదు. కాని, వాటి రూపములలో భిన్నత్వము ఉంది. చతుష్పాద గోవునుండి పాలు లభించునట్లే పృథివీరూప గోవునుండి బియ్యము యవలు ఓషధి వనస్పతులు అను పాలు లభించును. ద్యౌరూప గోవునుండి నీరు అను పాలు లభించును. వాణిరూప గోవునుండి సత్యము

అను పాలు లభించును. ఈ సత్యరూప దుగ్ధము అన్నిటికన్న గొప్పది.

పైన చెప్పబడిన యాజ్ఞవల్క్య మహర్షి అభిప్రాయము లన్నియు వేదమూలకములే. పరమేశ్వరుడు యజుర్వేదముద్వారా పయః (పాలు) ఏఏ రూపములలో నుండునో వివరించి యున్నాడు.

1. సం మా సృజామి పయసా పృథివ్యాః
సం మా సృజామ్యద్భి రోషధీభిః ।
సో 2 హం వాజం సనేయ మగ్నే ॥ (యజు. 18-35)

2. పయః పృథివ్యాం పయ ఓషధీషు పయో దివ్యన్తరిక్షే
పయో ధాః । పయస్వతీః ప్రదిశః సన్తు మహ్యామ్ ॥
(యజు. 18-36)

3. పయసో రూపం యద్ యవా దధ్నో రూపం కర్కన్ధూని॥
(యజు. 19-23)

4. పయసో రేత అభృతం తస్య దోహమశీమహ్యుహ్యుత్తరా
ముత్తరాం సమామ్ ॥ (యజు. 38-28)

పై ప్రమాణములలోని పయః అను పదమునకు రసము లేదా సారము అని గ్రహించాలి. గోవులు గడ్డిలోనున్న సెల్యులోజ్ అను పిండి పదార్థమును తమ జీర్ణరసములద్వారా జీర్ణము చేసి పాలరూపమున మనకు అందించుచున్నవి. కనుక పాలు గడ్డియొక్క సారము. అట్లే వృక్షజాతులు పృథివిలోని ఖనిజలవణములను, నీటిని గ్రహించి గాలి, సూర్యరశ్మల సహకారముతో మనకు ఓషధులను, వనస్పతులను అందిచును కనుక అవి పృథివీ సారము. అంతరిక్షములో నీరు ఆవిరి రూపములో నుండును. అది మేఘములుగా ఏర్పడి పరిస్థితులు అనుకూలించినపుడు వర్షించి మనకు జలరూపమున లభించును. కనుక

అది అంతరిక్ష సారము. వాక్కు అనేకరూపములలో నుండును. అందు ఎన్నియో వ్యర్థ వాక్కులే ఉండును. వాటిలో సారవంతమైనవి సత్యవాక్కులు మాత్రమే. కనుక సత్యము వాక్ యొక్క సారముగా గ్రహించాలి.

పై ప్రసంగములో నీటితోకూడా ఆహుతు లివ్వవచ్చునను భావము కనబడును. అన్నిటికన్న అదియే తేలిక యని అనిపించును. కాని, అగ్నిలో నీటితో నాహుతు లిచ్చిన అది చల్లారి పోవును కదా ! అది అగ్నిహోత్ర మెట్లగును? కావున దీనివెనుక ఒక గంభీరమైన అర్థము దాగియున్నది. అది ఏదియో తెలిసికొన ప్రయత్నింతము రండు.

అగ్నిహోత్రము యజ్ఞమునకు ప్రతీక. యజ్ఞము చాలా విశాల అర్థము గలది. యజ్ఞ పదములోని దేవపూజ సంగతికరణ దానము లను మూడు అర్థములును అగ్నిహోత్రములో క్రియారూపమున కనబడును. అందుచే మన ఋషులు యజ్ఞమునకు ప్రతీకగా అగ్నిహోత్రము నెన్నుకొనిరి. ప్రతిదినము ఉదయ సాయంకాలములందు ఆ ప్రతీక ముందు (అగ్నిహోత్రము ముందు) కూర్చొని యజ్ఞమయ జీవితము గడుప సంకల్పించుచుండిరి. యజ్ఞముయొక్క ముఖ్యార్థము దానము - పరోపకారము. మన కష్టార్జితములోని కొంత భాగము కష్టములలోనున్న తోటి ప్రాణులకు పెట్టుటయే యజ్ఞము. ఆ పరోపకారము ఎంత ఎక్కువగా చేయగలిగితే అంత మంచిది. అవసరమైతే ఆత్మబలిదానముచేయ సంసిద్ధులుగా ఉండాలి. అది అన్నిటికన్న గొప్ప యజ్ఞము. తీవ్రమైన కరువు కాటకము లేర్పడి త్రాగుటకు నీరుకూడా దొరకని సమయములో మనకు కొంత నీరు లభించిన దానిని దప్పికతో చచ్చుటకు సిద్ధముగా నున్న మరొక ప్రాణి గొంతులో పోయుట కూడా యజ్ఞమే. ఆ యజ్ఞములో నీరే ఆహుతిగా నుండును. దీనికి రంతిదేవుని కథయే దృష్టాంతము.

పూర్వము రంతిదేవు డను పేరుగల ఒక రాజు ఉండెను. అతడు యజ్ఞమయ జీవితము గడుపు ఒక ధర్మమూర్తి. దురదృష్టవశమున ఆయన దేశములో భీకరమైన కరువు ఏర్పడినది. వరుసగా కొన్ని సంవత్సరములు వర్షములు కురియలేదు. పంటలు పండకపోగా నీటికికూడా కరువు ఏర్పడినది. రాజు తన శక్తివంచనలేకుండా దూరప్రాంతములనుండి ధాన్యములు, నీళ్ళు, తెప్పించి ప్రజలను ఆదరించెను. క్రమముగా ఖజానా ఖాళీ అయినది. వరుణుడు కరుణించలేదు. ప్రజలు కడుపు చేతబట్టుకుని దూరదేశాలకు వెళ్ళిపోతున్నారు. చివరికి రాజుకుకూడా ఆకలిబాధ తప్పలేదు. వరుసగా 47 రోజులు పస్తుల్వుండవలసి వచ్చినది. 48వ రోజు కొద్ది ఆహారం, నీళ్ళు దొరికినవి. అప్పుడు ధర్మదేవత రంతిదేవ మహారాజును పరీక్షించదలచెను. ముందుగా ధర్మదేవత బ్రాహ్మణ అతిథిరూపమున వచ్చి 'భిక్షాందేహి' అని యాచించెను. రంతిదేవుడు ఆకలితోన్న అతిథిని ఆదరించుట మొదటి కర్తవ్యముగా భావించి తనకు లభించిన కొద్దిపాటి ఆహారమునుండి సగభాగము ఆ బ్రాహ్మణ అతిథికి పెట్టివేసెను. తదుపరి ఒక పేదవానిరూపమున వచ్చి ఆకలికి ఆగలేపోవుచున్నానని యాచించగా మిగిలిన సగభాగము అతనికి పెట్టివేసెను. ఇక మిగిలినది కొద్ది నీరు మాత్రమే. ఆ కొద్ది నీటిని త్రాగి గొంతు తడుపుకుందామనుకుంటూ ఉండగా ధర్మదేవత ఒక కాటి కాపరి రూపములో నాలుగు కుక్కలను వెంటపెట్టుకొని రంతిదేవుని వద్దకు వచ్చెను. నేను, నా కుక్కలు చాలా రోజులుగా ఆహారములేక అలమటించి పోతున్నామనియు, ఏదైనా ఆహారముపెట్టి కాపాడమనియు ప్రార్థించెను. రంతిదేవుడు తన నిస్సహాయస్థితని తెలిపి ఈ కొద్ది నీరు తప్ప మరి నావద్ద ఏమియు

లేదనెను. అంత ఆ కాటికాపరి "ఓ రాజా ! ఆకలితో బాటు దాహము మమ్ము మరింత బాధించుచున్నది. గొంతు ఎండిపోవు చున్నది. ప్రాణములు నిలిచేటట్టు లేవు. ఆహారము లేకున్న పోనీ కనీసం ఈ నీరైనా యిచ్చి మా ప్రాణాలు నిలబెట్టు"మని ప్రార్థించెను.

ఆ మాటలతో రంతిదేవుని హృదయము కరగిపోయెను. ఆతనిలోని యాజ్ఞకస్పృహ జాగృతమయ్యెను. ఈ కొద్దినీరు త్రాగి నా ప్రాణములు కాపాడుకొనుటకన్న తోటి ప్రాణుల ప్రాణాలు కాపాడుటే ధర్మమని భావించెను. అంత, ఆ నీరు కాటికాపరికి యిచ్చివేసెను. కాటికాపరి ఆ నీటిని కొంత తనవెంట ఉన్న కుక్కలకు పోసి, కొంత తాను త్రాగెను. వెంటనే కాటికాపరి రూపములోనున్న ఆ ధర్మదేవత తన నిజరూపముతో ప్రత్యక్షమై "ఓ రంతిదేవ ! నీలోని యాజ్ఞికస్పృహను పరీక్షించుటకే నేను ఈ రూపములో నీవద్దకు వచ్చితిని. నీలోని త్యాగశీలతకు నా హృదయపూర్వక ధన్యవాదములు కృతజ్ఞతలను తెలుపుటకు నీకు కొన్ని వరముల నివ్వదలచితిని. నీకు ఏమేమి వరములు కావలెనో కోరుకో" మనెను. అంత రంతిదేవుడు ఈ క్రింది విధముగా ఒకే ఒక వరమును కోరుకొనెను.

శ్లో ॥ న త్వహం కామయే రాజ్యం
న స్వర్గం న పునర్భవం ।
కామమే దుఃఖతప్తానాం
ప్రాణినా మార్తి నాశనమ్ ॥

ఓ ధర్మదేవత ! నేను సిరిసంపదలతోకూడిన విశాల సామ్రాజ్యమును కోరుట లేదు. విశేష సుఖములనిచ్చు స్వర్గమును కోరుట లేదు. ఇంతకన్నను ఉత్తమ జన్మను ప్రసాదించుమనియును కోరుట

లేదు. చివరకు ముక్తినికూడా కోరుట లేదు. నే నొకటే వర మడుగు చున్నాను. ఇతర ప్రాణుల దుఃఖమును నే ననుభవించి వాటకి సుఖము కలుగజేయునట్లు వరమును ప్రసాదించమని వేడుకొనుచున్నాను.

కోరను రాజ్యము స్వర్గము
కోరను మోక్షంబుకూడా కోరను దేవా
దారుణ దుఃఖిత జీవుల
కూరిమి గాపడ మదిని గోరుదు నెపుడున్ ।
అని కోరెనట.

పై కథ కల్పిత కథనో లేక చారిత్రిక కథనో తెలియదు. కాని పై కథ ద్వారా కవి అందజేసిన సందేశము మాత్రము మహోన్నతమైనది. ఇది వైదిక యాజ్ఞిక భావనను ప్రస్ఫుటపరచుచున్నది.

రంతిదేవుడు దాహార్తితోనున్న ఆ కాటికాపరి నోటిలో పోసిన ఆ కొద్ది నీరే నిజమైన ఆజ్యము. ఇట్టి అగ్నిహోత్రము వెయ్యి ఆశ్వమేధములు చేసిన దానికన్నను మిన్నయైనది. జిజ్ఞాసువైన జనక మహారాజు అడిగిన అనేక ప్రశ్నలకు సమాధాన మిచ్చుచు. యాజ్ఞవల్క్యమహర్షి "పాలు, వ్రీహి యవలు, ఓషధులు, వనస్పతులు లభించకున్నచో "అద్భ్యః" - నీటితో ఆహుతులివ్వవచ్చు" నని చెప్పిన మాటల వెనుకనున్న అంతరార్థ మిదియే.

అగ్నిహోత్ర ప్రతీక ముందు కూర్చుని గ్రహించిన ప్రత్యాయ నీయమునే రంతిదేవుడు తన నిజ జీవితమున ఆచరించెను. యజ్ఞమయ జీవిత మనగా నిదియే.

యజ్ఞమయః అయం పురుషః

## సత్వక్రాంతి - శ్వేతక్రాంతి

అగ్నిహోత్ర విషయములో మహర్షి యాజ్ఞవల్క్యుని భావములు క్రాంతిని సూచించును. అయితే, వారి క్రాంతి నేడు లోకములో మనము చూచువంటి క్రాంతివంటిది కాదు. వారిది సత్వక్రాంతి. దానినే శ్వేత క్రాంతి యనికూడా అనవచ్చును. క్రాంతి యనే పదము క్రము-పాదవిక్షేపే అను ధాతువుతో తయారగును. కాన, విశేషగతి లేదా విశేష పరివర్తన యని దీని అర్థము. సమాజములో ఒక మార్పు నెమ్మది నెమ్మదిగా కలిగితే దానిని సంస్కరణ అంటారు. అదే పరివర్తన విశేషగతితో కలిగితే క్రాంతి అంటారు. మహర్షి యాజ్ఞవల్క్యుడు అగ్నిహోత్ర విషయములో వ్యక్తపరచిన అభిప్రాయములను పరిశీలించినో వారిది క్రాంతి మార్గముగానే గోచరించును. అయితే, వారిది సత్వక్రాంతి.

రష్యా, చైనా దేశములలో జరిగిన కార్మిక విప్లవమునకు వారు రక్తక్రాంతి యనియు ఎఱ్ఱక్రాంతి యనియు పేర్లు పెట్టిరి. దీనిని మనము రాజసక్రాంతి యనవచ్చును. అట్లే మన దేశములో పంటలలో స్వయం సమృద్ధిని సాధించ ప్రయత్నము జరుగుచున్నది. దీనికి వారు హరితక్రాంతి యని పేరు పెట్టిరి. దీనిని తామస క్రాంతి యనవచ్చును. ఇచ్చట తమస్ అనగా అజ్ఞానమని అర్థం కాదు. ఆహార సమృద్ధికొరకు పథకం ప్రకారం నెమ్మది నెమ్మదిగా చేయు ప్రయత్నము. ఏలనన లోకములో ఎన్నిరకముల క్రాంతులున్నను ప్రకృతిలోని సత్వరజస్ తమస్సు లను మూడిటిలోనికి విభజింపవలసి వచ్చును. ఇక యాజ్ఞవల్క్య మహర్షి చేపట్టినది సత్త్వక్రాంతి. మానవుల ఆలోచనా సరళిలోనే ప్రకాశవంతమైన మార్పును తీసుకు వచ్చుటకు ప్రయత్నించెను. అది జ్ఞానపూర్వకమైనది. వేద సమ్మతమైనది. కాన, దానికి సత్వక్రాంతి యని పేరిడుట జరిగినది.

దీనిని జ్ఞాన క్రాంతి, శ్వేతక్రాంతి యనికూడా అనవచ్చును. (క్రాంతు లెన్నియున్నను మనము సత్వక్రాంతిని (జ్ఞాన క్రాంతిని) అనుసరించుటయే మంచిది. అదే మనను క్షేమముగా, నిరాటంకముగా లక్ష్యమునకు చేర్చగలదు.

యాజ్ఞవల్క్య మహర్షి మానవసమాజములో నాటిన ఈ శ్వేతక్రాంతి బీజాలు పరిస్థితులు అనుకూలించినపుడు మొక్కలుగా మొలకెత్తి వటవృక్షములుగా వికసించి తరతరాలకు శీతల ఛాయల నివ్వగలవు. సర్వత్ర శాంతి, అభయము, ఆనందము వెల్లివిరయగలదు. నేడు రక్తక్రాంతి హరితక్రాంతులుగా వ్యవహరింపబడు రాజస తామస క్రాంతులుకూడా శ్వేతక్రాంతిలో అంతర్భాగములైనచో మరింత వికసించగలవు. కనుక ప్రపంచ మేధావులంతా శ్వేతక్రాంతిని (సాత్త్విక క్రాంతిని) అనుసరించుటయే మంచిది.

ఎవరు ఏ రంగములో కృషి చేయుచున్నను మానవ సమాజరూప అగ్నిహోత్రములో ఆహుతులుగా నివ్వవలసినవి పాలు మాత్రమే – పయ ఏవ ఇతి'. రైతులు భూమిరూప గోవునుండి సమాజమునకు కావలసిన పంటలను పితుకుటయే (పండించుటయే) వారి ఆహుతి యగును. ఇచట రైతులు గుర్తించవలసినది ఏమన పృథివీరూప గోవునుండి ఆహుతిగా నిచ్చుటకు పిండవలసినవి పాలు మాత్రమే. విషము కాదు. పొగాకు, గంజాయి, కాఫీ, టీ మొదలగు పంటలు విషతుల్యములు. అవి సమాజమునకు హానికరములు. అవి రాజస తామస ప్రవృత్తులను కలిగించుటయే గాక స్వాస్థ్యమును చెడగొట్టి సమాజమును నిర్వీర్యము చేయును. కాన, అవి పనికిరావు, అందుచేతనే యాజ్ఞవల్క్య మహర్షి రైతులతో మీరును ఆహుతు లివ్వవచ్చును. కాని, అవి "వ్రీహి యవాభ్యాం

– వ్రీహి యవాదులుగా నుండవలె" నని సూచించెను. ఇచట వ్రీహి యవాదు లనగా మానవులకు ఆహారముగా నుపయోగపడి, వారి బలారోగ్యములను పెంచు ఆహార ధాన్యము లని గుర్తించవలెను. వీరు ఇచ్చు ఈ ఆహుతి ఆజ్యము వంటిదే. వారి కృషి అగ్నిహోత్రమే. ఆహార స్వయం సమృద్ధికి తీవ్రముగా కృషిచేయుటయే హరితక్రాంతి.

అట్లే అటవీ విభాగమువారు అడవులను రక్షిస్తూ, వృద్ధిచేస్తూ ఆరోగ్యమునిచ్చు ఓషధులను వనస్పతులను ఎక్కువగా ఉత్పత్తిచేస్తూ వాటిని సమాజరూప అగ్నిహోత్రములో ఆహుతులుగా నివ్వవచ్చును. అందుచేతనే మహర్షి "యా ఆరణ్యా ఓషధయః స్యుః" – ఆరణ్య ఓషధులతోను, "వానస్పత్యేన" – వనస్పతులతోను కూడా ఆహుతు లివ్వవచ్చునని చెప్పెను. ఇవి కూడా పృథివీరూప గోవునుండి లభించు "పయ ఏవ ఇతి" పాలు వంటివే.

పృథివీరూప గోవునుండి ఏ రకమైన పాలు పిండవలెనన్నను తగిన నీటి వ్యవస్థ అవసరము. అన్ని రకముల వృక్షజాతులు, జంతు జాతులు జలముపైననే ఆధారపడి యున్నవి. పరమేశ్వరుడు చేయు సృష్టిరూప యజ్ఞములో సహజముగానే వర్షములు కురియు ఏర్పాటు కలదు. కాని, ఆధునిక మానవుడు అజ్ఞానమువలన నాగరికత పేరుతో విలాసములకు సోమరితనమునకు అలవాటుపడి వాతావరణమును కలుషితము చేయుచున్నాడు. అందుచే ఋతుపవనములు వచ్చియు వర్షములు పడుటలేదు. తుఫాను లేర్పడి వర్షములు సముద్రముల పాలగుచున్నవి. భూమిపై కొన్నిచోట్ల అతివృష్టి, కొన్నిచోట్ల అనావృష్టి ఏర్పడి తీవ్రమైన నీటికొరత ఏర్పడింది.

ఇట్టి పరిస్థితులలో ముందుగా వాతావరణ కాలుష్య కారణాలను అన్వేషించి వాటిని నిరోధించాలి. ఈ విషయంలో ప్రజలను జాగృతం

చెయ్యాలి. ప్రజలను నిత్యాగ్నిహోత్రం చేయ ప్రేరేపించాలి. అనావృష్టి ప్రాంతాలను గుర్తించి వర్షాకాలంలో అచ్చట వర్షేష్టి యజ్ఞాలు నిర్వహించాలి. కురిసిన వర్షాలలో ఎక్కువ శాతం భూమిలోనే యింకుటకు ప్రయత్నించాలి. నదులకు అనకట్టలు కట్టి కాలువలద్వారా పంటభూములన్నిటికి సమృద్ధిగా నీరు అందించాలి. మెట్ట భూములలో చెరువులను, బావులను అభివృద్ధి పరచి వాటిని జలపూర్ణములు చెయ్యాలి. ఈ విధంగా సమాజరూప అగ్నిహోత్రములో నీటిని ఆహుతిగా ఇవ్వాలి. యాజ్ఞవల్క్య మహర్షి సూచించిన "అర్ఘ్య" జలమును ఆహుతిగా నివ్వవచ్చు" నను మాటలు జలక్రాంతిని ప్రేరేపించుచున్నవి. దీనిని జలయజ్ఞము అనియును అనవచ్చును.

జలక్రాంతియు సమస్యను పూర్తిగా పరిష్కరింపజాలదు. ఎంతవరకు లోకమున అజ్ఞాన ముండునో అంతవరకు ఏ క్రాంతియును బ్రతికి బట్ట కట్టజాలదు. అజ్ఞానము తొలగిపోయిన మిగిలిన సమస్య లన్నియు క్రమముగా వాటంతట అవిగా తొలగిపోవును. నేడు అజ్ఞానమువలననే గో సంరక్షణ సరిగా జరుగుటలేదు. చతుష్పాద గోవుల పాలు పిండబడుట లేదు. రైతులు ఉత్తమ ఆహార పదార్థములను పండించుట లేదు. వన ఆరణ్య విభాగములు ఔషధ వనస్పతులను ఉత్పత్తి చేయుటలేదు. వాతావరణ కాలుష్యముపట్ల లక్ష్యము లేదు. ఋతు చక్రమును సరిచేయు యజ్ఞయాగాదులను చేయుటలేదు. సరియైన నీటి వ్యవస్థకై యత్నించుట లేదు. ఈ అజ్ఞాన జనిత రోగముల కన్నిటికి ఏకైక ఔషధము - సత్యజ్ఞాన వికాసము-జ్ఞాన క్రాంతి అదియే మహర్షి యాజ్ఞవల్క్యుడు ఎంచుకున్న చివరి ప్రత్యామ్నాయము. జనక మహారాజు "యద్ ఆపో న స్యుః తర్హి కేన జుహుయాః ?" ఒకవేళ జలముకూడా

లేకున్న దేనితో నాహుతి నివ్వవలయును? అని అడుగగా మహర్షి యాజ్ఞవల్క్యుడు సర్వరోగ నివారక ఔషధము నొకటి తెలిపెను. అది ఏది యనగా "ఆహుయతైవ సత్యం శ్రద్ధాయామ్ । శ్రద్ధా అగ్నిః సత్యమ్ ఆజ్యమ్" శ్రద్ధ యను అగ్నిలో సత్య మను ఆహుతి నిమ్ము.

వివేకముతో సత్యాసత్యములను విచారించి సత్యమును తెలిసికొనుము. ఆ సత్య మను ఆజ్యమును శ్రద్ధ యను అగ్నిలో నాహుతిగా నిచ్చి విస్తృతపరచుకొనుము. అగ్నిలో వేసిన ఆహుతి అగ్నిని మరింత ప్రకాశపరచుటయేగాక ఆ యాహుతి వాయురూపముచెంది గాలిలో కలిసి అంతట విస్తరించును. అట్లే శ్రద్ధతో కూడిన సత్యము ఆత్మను ప్రకాశపరచుటయేగాక లోకమున విస్తరించి లోకమును ప్రకాశపరచును.

ఏ క్రాంతియైనను కాలక్రమమున బలహీనపడుట సామాన్యము. మరల ఏ మహాపురుషుడైనా ఉద్భవించి దానిని పునరుద్ధరించవలసి యుండును. అట్లే, యాజ్ఞవల్క్య మహర్షి ప్రారంభించిన ఈ సత్యక్రాంతి క్రమముగా బలహీనపడి అగ్నిహోత్రము కేవలము కర్మకాండ వరకే పరిమితమైపోయినది. ఇంతియేగాక, తాంత్రిక గ్రంథముల ప్రభావముతో కర్మకాండయు దూషితమైపోయినది. యజ్ఞయాగాదుల పేరిట అనేక పశువులు బలియైపోయెడివి. అధ్వరముగా (ఏ ప్రాణిని హింసించనిదిగా) ప్రసిద్ధిని బొందిన అగ్నిహోత్రము ధ్వరితమైపోయినది. (హింసాయుతమై పోయినది). మహాత్మా బుద్ధుని వరకు ఈ స్థితి యిట్లే కొనసాగినది. బుద్ధ భగవానుడు ఈ హింసను సహించలేపోయెను. ఇది అధర్మము అన్యాయము నని ఎదిరించెను. దానికి ఆనాటి యాజ్ఞికులు "ఇది వేదాదేశము. ఇది దేవుని యాజ్ఞ" యని బదులిచ్చిరి. వేదాధ్యయనము చేయకపోవుటచేతను, సంస్కృతము రాకపోవుచేతను గౌతమ బుద్ధుడు వేదములను పరిశీలించలేకపోయెను.

సత్యమును తెలిసికొనలేకపోయెను. వివశుడై "అహింసా పరమో ధర్మః' అను పునాదిపై నూతన మతమును స్థాపించి ప్రచారము చేసెను. యజ్ఞయాగాదులను నిరసించెను. ఆ మహాత్ముని ప్రభావముతో యాజ్ఞిక హింస కనుమరుగైనదేకాని అజ్ఞానరోగము నయముకాలేదు. ఆ యజ్ఞాన రోగము నాస్తికరోగముగా పరివర్తన చెందినది. ప్రజలు యజ్ఞాయాగాదులకు పూర్తిగా దూరమైపోయారు. కనీస మాచరించవలసిన పంచమహాయజ్ఞాలు సయితము కనుమరుగైపోయనవి. అనంతరము ఆది శంకరాచార్యులవారు ప్రజలను ఆస్తికులుగా చేయగలిగినారేకాని యజ్ఞయాగాదులను పునరుద్ధరించలేదు. ఇంతేగాక, వేదమతం స్థానంలో నవీనాద్వైత మతాన్ని కూర్చోబెట్టారు. ఆ తదుపరి విదేశీయుల ఆక్రమణతో, విమతస్థుల పాలనతో భారతదేశం మరియు వైదిక సంస్కృతి జీవచ్ఛవాలైపోయాయి.

అట్టి దయనీయస్థితిలో మహర్షి దయానందుని ఆవిర్భావము క్రొత్త ఆశను చిగురింపజేసింది. మహర్షి దయానందుడు దేశ సంచారము చేస్తూ భారతజాతి దీనహీనస్థితని అవగాహన చేసికొనెను. వివిధ సాంప్రదాయక గ్రంథముల నధ్యయనము చేసెను. వారి ధార్మిక కార్యకలాపములను వీక్షించెను. భారతజాతిని పట్టిపీడుస్తున్నది కేవలము అజ్ఞానరోగమే నని గుర్తించెను. రోగ కారణము తెలిసిన ఔషధ నిర్ణయము సులభమే. రోగకారణము అజ్ఞానము. కాన, ఔషధము అజ్ఞాన నివారక సత్యజ్ఞానము. ఆ సత్యజ్ఞానమున కాదిమ స్రోతస్సు ఈశ్వరీయ వేదజ్ఞానము. అందుచేతనే మహర్షి దయానందుడు వేదముల ఆధారంగా మానవ సమాజాన్ని సంస్కరించ పూనుకొనెను. యాజ్ఞవల్క్యమహర్షి ఎంచుకున్న మార్గముననే సత్యజ్ఞానాన్ని శ్రద్ధతో ప్రతిభావంతము చేసి లోకమున

వెదజల్లెను. అగ్నిలో వేసిన ఆహుతి గాలిలో విస్తరించినట్లు మహర్షి వేసిన ఆ సత్యజ్ఞానాహుతి అద్భుతముగా పనిచేయుచు ప్రపంచమేధావుల ఆలోచనా సరళినే మార్చి వేయుచున్నది. "సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించటకును ఎల్లపుడు సిద్ధముగా నుండు",దని ప్రేరేపించుచున్నది. అస్తు - అట్లే యగును గాక !.

## వాణీరూప గోవునకు నాలుగు స్తనములు

మహర్షి యాజ్ఞవల్క్యుడు అగ్నిహోత్రములో వేయతగినవి పాలు మాత్రమే నని చెబుతూ వివిధ గోవుల దుగ్ధములను గురించి చెప్పుట జరిగినది. అందులో మొదటిది చతుష్పాద గోదుగ్ధముకాగా చివరగా చెప్పినది వాగ్రూప గోవుయొక్క దుగ్ధము సత్యము. చతుష్పాద గోవునకు నాలుగు స్తనము లెట్లుండునో అట్లే వాగ్రూప గోవునకు నాలుగు స్తనము లుండును. అవి ఏవియో తెలిసికొందము రండు.

వాచం ధేను ముపాసీత । తస్యాశ్చత్వారః స్తనాః
స్వాహా కారో వషట్కారో హన్తకారః స్వధాకారస్తస్యై
ద్వౌ స్తనౌ దేవా ఉపజీవన్తి స్వాహాకారఞ్చ వషట్కారఞ్చ
హన్తకారం మనుష్యాః స్వధాకారం పితరః ।

(శతపథ బ్రాహ్మణము. 14-8-9-1)

వాగ్రూప ధేనువును ఉపాసింతము. దానికి నాలుగు స్తనములు కలవు. అవి స్వాహాకార, వషట్కార, హన్తకార, స్వధాకారములు. వాటిలో రెండు స్తనములతో అనగా స్వాహాకార వషట్కారములతో దేవతలు జీవించుచున్నారు. హన్తకారం వలన మనుష్యులు, స్వధాకారం వలన పితరులు జీవించుచున్నారు.

దేవతలకొరకు మనము ఏవిధముగా స్వాహాకారముతో

ఆహుతుతుల నిచ్చుచున్నామో అట్లే వషట్కారముతోను ఆహుతు లివ్వవచ్చును. ఎట్లన అగ్నయే స్వాహా, సోమాయ స్వాహా, ఇన్ద్రాయ స్వాహా అని ఎట్లు అనుచున్నామో అట్లే అగ్నయే వషట్, సోమాయ వషట్, ఇన్ద్రాయ వషట్ అను ప్రయోగములు యజ్ఞవిధానములలో అచ్చటచ్చట కనబడును.

## స్వాహాకారము మొదటి స్తనము

స్వాహ యనగా (సు - ఆహ వాజీతి) ఉత్తమ కథనము-మంచి ప్రియమైన వాక్కులు. మనం స్వాహాకార, వషట్కారములు పలికిన వెంటనే దేవతలు పులకితులగుదురు. వారు మననుండి త్యాగమును కోరుచున్నారు. ఆహుతులను కోరుచున్నారు. ముఖ్యముగా స్వాహాకారము వారికి ప్రియము. అది సమర్పణను సూచించును. ఇంతేగాక, స్వాహాకారములో మరికొన్ని అర్థములు గలవు. యాస్కమహర్షి తన నిరుక్త శాస్త్రమున **స్వాహా ఇతి ఏతత్, సు ఆహేతి వా, స్వావాగ్ ఆహేతి వా, స్వం ప్రాహేతి వా, స్వాహుతం హవిర్ జుహోతి వా॥** (నిరుక్తం. 8-20)

అని నిర్వచించెను. దీని భావ మేమనగా ఏ క్రియద్వారా సుందర, మధుర, కల్యాణకర వచనములు వ్యక్తము లగునో దానిని స్వాహా అనవచ్చును. తన ఆత్మలోని వాణినే నోటితో పలుకుట అనగా సత్యము చెప్పుట (మనసులో ఒక మాట పలుకులో ఒక మాట లేకుండుట) స్వాహా అగును. తన పదార్థమునే తనదని చెప్పుట, ఇతరుల వస్తువులను తనవని చెప్పకుండుట (ఇతరుల పదార్థములను ఆశించకుండుట) స్వాహా అనబడును. మరియు సంస్కరింపబడిన శాస్త్ర సమ్మతమైన హవిస్సును (హోమ ద్రవ్యమును) అగ్నిహోత్రములో ఆహుతిగా నిచ్చుటయు స్వాహా అనబడును.

నిఘంటువునందు వాక్ యొక్క నామములలో 'స్వాహా' అనునది యొకటి. ఇవేగాక సత్యక్రియ, సుష్టుక్రియ, దానక్రియ, ఉత్తమవాణి, ఉత్తమ ప్రవర్తన, సత్యవిద్య, సత్యజ్ఞానము అను అర్థములును ఉన్నవి. స్వాహా పదమునకు ఎన్ని అర్థము లున్నను ప్రకరణమునుబట్టి నిరుక్తకారుడు చెప్పిన చివరి అర్థమునే "స్వాహుతం హవిర్ జుహోతి' - సంస్కరింపబడిన హవిస్సును ఆహుతిగా నిచ్చుట యనియే ఇచట గ్రహింపవలెను. బ్రాహ్మణగ్రంథములును ఈ విషయమునే బలపరచును.

**అన్తో వై యజ్ఞస్య స్వాహాకారః (శత. 1-5-3-13)**

యజ్ఞ మంత్రముల చివర స్వాహాకారము నుచ్చరించి ఆహుతి నివ్వవలెను.

**యజ్ఞో వై స్వాహాకారః - (శత. 3-3-2-7)**

యజ్ఞము స్వాహాకారముతో జరుగును.

**అహుతమివైతద్ యద్ అస్వాహా కృతమ్ - (శత. 4-5-2-17)**

స్వాహాకారములేని ఆహుతి ఆహుతిగా నెంచబడదు.

ఈ భావము లన్నియు వేద మూలకములే. వేదము ఈ విధముగా చెప్పును.

అస్య హోతుః ప్రదిశ్యృతస్య వాచి స్వాహాకృతం హవిరదన్తు దేవాః
(ఋగ్వేదము. 10-110-11)

ఈ మంత్రమునకు యాస్కమహర్షి తన నిరుక్తమునందు
**అస్యహోతుః ప్రదిశి ఋతస్య వాచ్యాస్యే స్వాహాకృతం
హవిరదన్తు దేవాః, ఇతి యజన్తి ।** అని నిర్వచించెను.

అనగా ఈ యజ్ఞముయొక్క ఉత్తమ స్థానము (లేదా పూర్వదిశలో) బాగా అగ్నిజ్వలించు స్థానములో యజ్ఞీయ అగ్నిముఖమున స్వాహా

పూర్వకముగా నర్పించు ఆహుతులను దేవతలు ప్రతితో స్వీకరింతురు. కాన, ఈ విధముగా స్వాహాపూర్వక యజ్ఞము చేయుదురు.

స్వాహాకృతే ఊర్ధ్వ నభసం మారుతం గచ్ఛతమ్

(యజు. 6-16)

ఉచ్చ స్వరముతో చెప్పబడిన స్వాహాకారము వాయురూపము చెందిన ఆహుతిని నభోమండలము వరకు తీసికొని పోవును.

'స్వాహా దేవానా ముత్క్రమణమసి' (యజుర్వేదము. 7-26)

స్వాహా ఉచ్చారణ వలన దేవతలయొక్క వృద్ధి, ఉన్నతి కలుగును.

స్వాహాకారము వలన దేవతలకేగాక మనకును లాభ మున్నది. ఉచ్చ స్వరముతో స్వాహా పదము నుచ్చరించినపుడు నాభిస్థ అపానము కంఠస్థ ప్రాణముతో కలియును. దీని వలన మన ఊపిరితిత్తులు యజ్ఞవాయువును ఎక్కువగా స్వీకరించ గలగును. అట్టి యజ్ఞవాయు మిశ్రిత ప్రాణవాయువువలన మన యింద్రియములు బలపడును.

## వషట్కారము రెండవస్తనము

స్వాహాకారము దేవతలకు ప్రియమైనట్లే వషట్కారమును ప్రియమైనదే. వారు మననుండి త్యాగమును ఎట్లు కోరుచున్నారో అట్లే ఆజ్ఞాపాలననుకూడా కోరుచున్నారు. వారు ఉపదేశించిన లేదా వారు సూచించిన విధివిధానములను మనము శిరసావహించి తు.చ. తప్పక ఆచరించినచో వారు అనగా దేవతలు ప్రసన్నులగుదురు. దానికి ఏ కొద్ది విపరీతముగా జరిగినను వారు సహించరు. కనుక యజ్ఞ విధివిధానములలో ఏవైనా పొరపాట్లు జరిగినచో పురోహితులలో పెద్దవాడైన బ్రహ్మ (పూర్ణజ్ఞాని) 'వషట్' పలికి యజ్ఞకర్తలను (యజమయానులను) జాగృత పరచును. ఈ వషట్కారము వజ్రము

వంటిదని బ్రాహ్మణములు చెప్పును. "వజ్రోవై 'వషట్కారః' (శతపథ బ్రా. 14-8-9-1) అనగా 'వషట్ పదము వజ్రాయుధమువంటిది. ఈ పదము (మాట) వినగానే యజ్ఞకర్తలు పొరపాటును గ్రహించి మరల ఆ క్రియను మొదటినుండి ప్రారంభించి చేయుదరు. అందువల్ల దేవతలు వషాట్కారము వినగానే వీరు తమ తప్పు తెలుసుకొని దానిని సరిచేసుకొన యత్నించుచున్నారని ప్రసన్నులగుదురు. వషట్ పదము 'వహ్ ప్రాపణీ' అను ధాతువుతో తయారగును. కనుక దీనికి భారము మోయుట, ఆజ్ఞను శిరసావహించుట అని అర్థం. యజ్ఞక్రియలో 'వషట్' అనగా 'విధిని శిరసావహించు. తప్పు జరుగుచున్నది. సరిచేసుకో' అని అర్థం.

ప్రఖ్యాత ఆర్య విద్వాంసులు పండిత బుద్ధదేవ్ విద్యాలంకార్ గారు వేదములను, బ్రాహ్మణములను లోతుగా నధ్యయనము చేసిన గొప్ప విద్వాంసులు. వారు శతపథబ్రాహ్మణమునకు వ్రాసిన బాష్యము చాలా ప్రామాణికమైనదని విద్వాంసులందరు కొనియాడిరి. వారు 'పంచయజ్ఞ ప్రకాశము' అను గ్రంథములో వషట్ కారము గురించి ఈ విధముగా వివరించిరి. "వషట్కార మనగా తరోనెస్ (Thoroughness) సమగ్రముగా చేయుట. మ్రొక్కుబడిగా పూర్తిచేసి సంతుష్టి చెందుటకాదు. ఒక గోడను పదిసార్లు పడగొట్టి మరల కట్టినను ఫరవాలేదు కాని వంకరగా నిర్మించరాదు. తగిన విధముగా యిచ్చిన కొలతలకు అనుగుణముగా నిర్మించాలి. ఈ విధముగా (అటెన్షన్ టు డిటైల్) పూర్తి జాగురూకతతో కార్యమును సమగ్రముగా పూర్తిచేయుటనే వషట్ అందురు" అని వివరించిరి. కనుక ఈ పదము ఆచరణకు సంబంధించినది.

ఏ విధముగా యజ్ఞ విధానములో వషట్కారము విధిని సరిచేయునో అట్లే సమాజములో ఏవైనా కురీతులు ఏర్పడినచో వాటిని

కూలద్రోయుటకును వషట్కారము అనగా ఖండన ప్రయోగింపబడును. బ్రాహ్మణ వాణి (విద్వాంసుల వాణి) అందుకొరకు ప్రయోగించినను దేవతలు సంతసింతురు. అందుచేతనే మహర్షి దయానందులవారు సమాజములో ఏర్పడిన కురీతులను కూలద్రోయుటకే 'పాఖండ ఖండినీ' పతాకము నెగురవేసి వషట్కారము పలికి సత్యజ్ఞానము నుపదేశించిరి. ఇట్టి క్రియలు దేవతలకు ప్రియము. వారికి యిట్టివే ప్రాణాధారములు. అందుచేతనే 'వషట్కారం దేవా ఉపజీవన్తి' అని చెప్పబడినది.

## హన్తకారము మూడవ స్తనము :

ఏ విధముగా స్వాహాకారముతోను, వషట్కారముతోను దేవతలు ప్రసన్ను లగుదురో అట్లే సాధారణ మానవులు హన్తకారముతో ప్రసన్ను లగుదురు. హన్త పదమునకు రెండు అర్థములు చెప్పుదురు. ఒకటి సంతోషమును వ్యక్తపరచుట. రెండవది ఖేదమును (బాధను) వ్యక్తపరచుట. ఎవరైనా వ్యక్తి బాధలో ఉన్నపుడు సానుభూతిని వ్యక్తము చేయుచో అతడు ప్రసన్నుడగును. కనీసం నన్ను పలకరించి, నా బాధను తెలిసికొని సానుభూతిని ప్రకటించెను కదా యని సంతసించును. అట్లే ఎవరైనా గెలుపొందినచో లేదా గొప్ప కార్యమును చేసినచో "శహబాశ్, బాగా చేసినావు, అద్భుతము చేసి చూపినావు" అని ప్రశంసించినచో అతడు మరింత ఆనంద భరితుడగును. మనపట్ల కృతజ్ఞత కలిగియుండును. ధన్యవాదములు (థేంక్స్) తెలుపును.

ఈ విధముగా మానవులు విజయములో ప్రశంసలను, బాధలో సానుభూతిని కోరుదురు. దీనినే శతపథబ్రాహ్మణకర్త హన్తకార మనెను. ఇది వాగ్రూప గోవునకు మూడవ స్తనముగా పేర్కొనెను. దీనిని చక్కగా ఉపయోగించుకొని సామాజిక జీవనము ప్రసన్నముగా గడుపుమనెను.

మన వాణినుండి వచ్చిన ఆ కొన్ని మాటలే అద్భుతముగా పనిచేసి తోటి వారికి ఉపశమనమును, ఆనందమును కలిగించును. దానివల్ల మనకును ప్రసన్నత కలుగును.

## స్వధాకారము నాలుగవ స్తనము

ఇంతవరకు వాగ్రూప గోవుయొక్క 3 స్తనముల గురించి తెలిసికొని యుంటిమి. మిగిలిన నాలుగవ స్తనము స్వధాకారము. దీనివలన పితరులు ప్రసన్ను లగుదురు. అనుప్రాణితు లగుదురు. ఏ ప్రాణి యైనను కాలక్రమమున వృద్ధాప్యపు బారిన పడుట సృష్టి నియమము. ఇతర ప్రాణులకన్న మానవుడు వృద్ధాప్యమువలన ఎక్కువ బాధపడును. అతని జీవితము పరాధీనమగును. ముఖ్యముగా పుత్రులపైన, పుత్రవధువులపైన ఆధారపడి యుండవలసి వచ్చును. కొడుకులు కోడండ్రు లేనివారు కూతురు అల్లుళ్ళపై ఆధారపడుదురు. అట్టి వారిని పితరులు అందురు. వారిని ఆదరించుట మన ధర్మం. మనలను కని, పెంచి, పెద్దచేసి, అనేక రకములుగా సేవలు చేసిన వారికి మనం ఎంతో ఋణపడి ఉంటాము. దీనినే పితృఋణము అంటారు. అట్టి ఋణము (అప్పు) తీరవలెనన్న వారు వృద్ధావస్థలో లేదా ఏదైనా వ్యాధితో నిస్సహాయస్థితిలో నున్నపుడు వారికి ఆహారముపెట్టి అవసరమైన అన్ని సేవలు చేయ్యాలి. ఈ పని వారు జీవించి ఉన్నపుడే చేయగలుగుతాము. ఋణం తీర్చుకో గలుగుతాము. చనిపోయిన వారికి సేవలు ఎట్లు చేయగలము? కనుకనే మన వేదాది శాస్త్రాలు జీవించి ఉన్నవారినే పితరు లనును. చనిపోయిన వారిని ప్రేత లనును.

అట్టి జీవిత పితరులకు స్వధాకారము ప్రియమైనది. స్వధా అనగా పితరులకు అన్నమిడుట 'స్వధా వై పితృణామన్నమ్' (శత.బ్రా13-8-1-4)

అని శతపథ బ్రాహ్మణము చెప్పును. వీనికి "స్వత్వాత్ ధారణయోగ్యా" అని నిర్వచనము చెప్పును. వారు నీవారు కాన వారు ఎట్టి స్థితిలో ఉన్నా వారిని ఆదరించి అన్న పానీయ సేవాదులతో సేవించాలి. మన ఆకలి దప్పికలు, అవసరాలు ఎటులనో వారివి కూడా అటులనే అని గుర్తించాలి.. స్వ శరీరమును సేవించు విధముగా వారిని సేవించాలి.

ఎప్పుడును 'పితృభ్యః స్వధాయిభ్యః స్వధానమః' (యజుర్వేదము 19-36) "ఓ పితరులారా! మీరు పెద్దలు. ఆదరించతగినవారు. మీరు మాకు ఎన్నో సేవలు చేసినవారు. మేము ఎన్ని సేవలు చేసినను మీ ఋణము తీరదు. మా శక్తికొలది మేమిదు అన్న పానీయాదులతో తృప్తిపడి, మమ్ము ఆశీర్వదించుడు" అనుచు వారికి సేవలు చేసిన వారు ఎంతో తృప్తి చెందెదరు. వారికి మనము యిచ్చు అన్నపానీయాదులకన్నను మన నోటినుండి వెలువడు స్వాంతన వచనములే ఎక్కువ ప్రియములు.

ఇచట పితరు లనగా మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు మాత్రమే కాదు. మనపై ఆధారపడియున్న తాతలు, ముత్తాతలు, నానమ్మలు, మునానమ్మలును మనకు పితరులే. వృద్ధులైన విద్వాంసులను, నిస్సహాయులైన బంధుమిత్రులను మరి ఎవరైనను మనపై ఆధారపడిన వారిని శ్రద్ధతో ఆదరించాలని యజుర్వేదము చెప్పును.

పితృభ్యః స్వధాయభ్యః స్వధా నమః,<br>
పితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ।<br>
ప్రపితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః<br>
**అక్షన్ పితరో అమీమదన్త పితరో అతీతృపన్త**<br>
**పితరః పితరః శున్ధధ్వమ్ ॥** (యజుర్వేదము 19-36)

భావము : సత్కారపూర్వకముగా సేవించయోగ్యులైన పితరులను,

పితామహులను, ప్రపితామహులను స్వధతో అనగా శుద్ధమైన అన్న రసాదులతో సత్కరించి సేవించాలి. ఓ పితరులారా ! మీ కొరకుమాచే పక్వము చేయబడిన శుద్ధమైన అన్నమును భుజించుడు. ఓ అధ్యాపకులారా ! మీరు కూడా మా భోజనమును భుజించి మమ్ము ఆనందితుల జేయుడు.

ఓ ఉపదేశకులారా ! మీరును భుజించి తృప్తిచెంది మమ్ము తృప్తుల జేయుడు. ఓ విద్వాంసులారా ! ఈ శుద్ధమైన ఆహారమును భుజించి మమ్ము శుద్ధుల జేయుడు.

మనము ఇంతవరకు వాగ్రూప గోవునకు గల స్వాహాకార, వషట్కార, హన్తకార, స్వధాకారము లను నాలుగు స్తనముల గురించి సంక్షిప్తంగా తెలిసికొంటిమి. దయామయుడగు పరమేశ్వరుడు మానవులమైన మనకు మాత్రమే యిచ్చిన వాక్శక్తిని (వాగ్రూప గోవును) సద్వినియోగము చేసికొని యజ్ఞమయ జీవితము గడపాలి. ఎవరి వాక్ నుండి పై నాలుగు రకముల క్షీరధారలు ప్రవహించునో వారి మస్తిష్కమునుండి అమృత ధారలు వర్షించి వారిని అమరులను జేయును. జనన మరణరూప సంసార చక్రబంధనమునుండి తప్పించి తృతీయ ధామమునకు (ముక్తికి) చేర్చును.

## శిరస్సే బోర్లించిన అమృత కలశము

దేవతలు అమరులు. వారు మృతహవిస్సును స్వీకరించరు. వారి కర్పించుటకు అమృతహవిస్సు అవసరమై యున్నది. అది మూడు రూపములలో నుండును. ఆ మూడు రూపము లెవ్వియో ఆచమన మంత్రములలో వ్యక్తమగును. వాటిని గురించి తదుపరి తెలిసికొందము. ముందు అమృతహవిస్సు ఎక్కడనుండి లభించునో తెలిసికొందము.

పురాణముల కథనం ప్రకారం క్షీరసాగర మథనం చెయ్యగా పద్నాలుగు రత్నములు ఉత్పన్నమయ్యెను. వాటిలో చివరగా ఉత్పన్న

మైనది అమృత కలశము. అది దేవతలకు వడ్డించబడినది. ఆ క్షీరసాగర మేదియో, ఆ పద్నాలుగు రత్నము లెవ్వియో మనము చెప్పజాలము. కాని, మానవుడు తనలోనే ఒక సముద్రమును కలిగియుండును. "పురుషో వావ సముద్రః" అని జైమినీయ ఉపనిషత్తు చెప్పును. పురుషుడు సముద్రము వంటి గంభీరుడు. అనేక జన్మలలోని అనేకానేక సంస్కారములు తనలో గలిగియుండును. వాటిని మథించినచో పద్నాలుగు రత్నములు లభించగలవు. చివరగా అమృత కలశమును లభించగలదు.

మన శిరస్సే ఒక అమృత కలశము. అది బోర్లించిన అమృత కలశము. దానిలో సర్వ యశస్సు నిహితమై యున్నది. "తిర్యగ్ బిలశ్చమస ఊర్ధ్వబుధ్నో, యస్మిన్ యశో నిహితం విశ్వరూపమ్ ।" అని అథర్వవేదము (10-18-9) చెప్పును. దానినుండి సత్యము, యశస్సు, శ్రీః అను మూడు అమృత ధారలు ప్రవహించును. ఆ యమృతధారలనే మనము ఆచమన మంత్రములలో కోరుకొంటున్నాము. వాటిని మనము శిరస్సునుండి పొందవలసి యున్నది. శిరస్సు అను పేరును అందుకే వచ్చినది. "యచ్ఛ్రియం సముద్రోహంస్తస్మాచ్ఛిర ఇత్యా చక్షతే" అని శతపథ బ్రాహ్మణము (6-1-1-4) చెప్పును. వాటిని మనం పొంది మన తోటివారికిని పంచిపెట్టాలి. ఈ విధంగా మనం సమాజాన్ని రాష్ట్రాన్ని విశ్వాన్ని అమృతమయం చెయ్యాలి.

## ఆచమనము

అగ్నిహోత్రం ఆచమన క్రియతో ప్రారంభమౌతుంది. ప్రతి ధార్మిక కర్మ ఆచమనంతో ప్రారంభించాలని ఋషుల నిర్దేశం. ఆచాన్తే కర్మ కురు. ఆచమన క్రియ పవిత్రత కొరకు చెయ్యాలని శతపథ బ్రాహ్మణం చెబుతుంది. ఆ బ్రాహ్మణం ఆ క్రియ వివరణతోనే ప్రారంభమౌతుంది.

వ్రతముపైష్యన్ । అన్తరేణాహవనీయం చ గార్హపత్యం చ ప్రాఙ్ తిష్ఠన్నప ౨ ఉప స్పృశతి, యద్యదప ఉపస్పృశత్యమేధ్యోవై పురుషో యదనృతం వదతి, తేనపూతి రన్తరతో మేధ్యా వా అపో మేధ్యో భూత్వా వ్రతముపాయానీతి, పవిత్రం వా ఆపః పవిత్ర పూతో వ్రతముపయానీతి తస్మాద్వా అప ఉపస్పృశతి ॥

(శతపథ బ్రాహ్మణం 1-1-1-1)

వ్రతధారణ చేయగోరు వ్యక్తి (యజమానుడు) ఆహవనీయ గార్హపత్య అగ్నుల మధ్య పూర్వాభిముఖుడై ఆచమనము చేయాలి. ఎందుచేతననగా మానవుడు అనృతము పలుకుటవలన అపవిత్రుడగును. అందుచే పవిత్రుడగుటకు ఆచమనము చేయాలి. నీరు పవిత్రమైనది. కనుక పవిత్రమైన నీటిని లోనికి గ్రహించి పవిత్రుడై వ్రతధారణ చేయాలి.

నీరు పంచభూతములలో ఒకటి. అది ఈ భూమిపై సమృద్ధిగానున్నది. ఈ నీటికి వర్షము ఆధారము. వర్షము నుండి లభించిన నీరు శుద్ధముగానే యుండును. అయితే అది మానవ జీవన సరళిలో కలుషితమగుచుండును. కనుక ఆచమనమునకు శుద్ధ జలమునే వినియోగించవలెను. శుద్ధజలము తను పవిత్రముగా నుండి దానిని సేవించినవారిని అది పవిత్రము చేయును. "ఆపో వై భేషజం" జలము గొప్ప ఔషధము. అది శారీరక మాలిన్యముల నన్నింటిని వెడలగొట్టి ఆరోగ్యము నిచ్చును. ఈవిషయమును వివరముగా తెలిసికొనగోరువారు మాచే ప్రచురింపబడిన "వేదాలలో జల చికిత్సా విజ్ఞానము " అను గ్రంథమును చూడగోరెదను.

అయితే ఆ నీరు అనృతమువలన కలిగిన అపవిత్రతను పోగొట్టగలదా ? యను సందేహము కలుగవచ్చును. దానికి సమాధాన

మేమన - నీరు నేరుగా మనస్సును పవిత్రము చేయలేకపోయినను శరీరమును పవిత్రముచేసి మనస్సును సత్యధారణకు అనువుగా జేయును. "ఆరోగ్యవంతమైన శరీరములోనే ఆరోగ్యవంతమైన మనస్సు ఉండును" అనునదియును ఒక ప్రకృతి నియమమే. యాజ్ఞవల్క్య మహర్షి అభిప్రాయమును ఇదియే. శతపథ బ్రాహ్మణమున ఆచమన క్రియ తదుపరిది వ్రతధారణ క్రియనే. ఆ వ్రతధారణ ఈ క్రింది వేదమంత్రముతో చేయవలె నని నిర్దేశించుచున్నది.

అగ్నే ! వ్రతపతే ! వ్రతం చరిష్యామి తచ్ఛకేయం
తన్మే రాధ్యతామ్ ! ఇద మహ మనృతాత్ సత్యముపైమి ॥
(యజుర్వేదము. 1-5)

ఓ అగ్నీ ! ప్రకాశస్వరూప పరమేశ్వర ! సత్యభాషణాది వ్రతములకు పతివైన ఓ పరమేశ్వర ! నేను సత్యవ్రతము నాచరించ సంకల్పించితిని. దానిని చక్కగా పాటించగల శక్తి నిమ్ము. అది నన్ను ప్రకాశపరచును గాక ! నేను ఇకనుండి అనృతమును విడచి సత్యమును అనగా వేదజ్ఞానమునకు, ప్రత్యక్షాది ప్రమాణములకు, సృష్టి క్రమమునకు, సృష్టి నియమములకు అనుకూలమైనదియు ; భ్రమ ప్రమాది రహితము, సర్వహితకరమును నగు సార్వభౌమిక సత్యమును మనసా వాచా కర్మణా స్వీకరింతును గాక!" యని సంకల్పించి వ్రతధారణ చేయాలి.

దీనినిబట్టి ఆచమనము సత్యధారణకు నాందిగా జేయు క్రియ. భాహ్యాభ్యంతర శుచులై వ్రతధారణ చేయవలె నునది శిష్టాచారము. స్నానాదులవలన బాహ్యాశౌచము, ఆచమనమువలన అభ్యంతర శౌచము జరుగును. ఇంతయేగాక, ఆచమనము వలన కంఠశుద్ధి జరిగి మంత్రోచ్చారణ చక్కగా చేయగలుగును. ఆ నీరు హృదయము వరకు

ప్రవహించి మనఃశాంతిని కలిగించును. యజ్ఞక్రియపై ఏకాగ్రత కలిగించును.

ఆచమనము చేయుటకు పాలు, పెరుగు, మజ్జిగ, ఫలరసాదులు మొదలగు ద్రవపదార్థము లెన్నియున్నను జలముతోనే ఆచమనము చేయవలెనని శాస్త్రములు చెప్పును. గోపథ బ్రాహ్మణము 'ఆపో అమృతమ్' అని చెప్పగా శతపథ బ్రాహ్మణము 'పవిత్రం వా ఆపః' అని చెప్పును. వేదము 'అప్స్వన్తరమృతమప్సు భేషజమ్' (యజు 9-6) నీటిలో అమృతము మరియు ఔషధము కూడా ఉన్నవని చెప్పును. "ఇమా ఆపః శము మే సన్తు" (యజు. 4-1) జలము శాంతిదాయకమనియు, "ఆపో అస్మాన్మాతరః శున్ధయన్తు (యజు. 4-2) తల్లివంటిదనియు మరియు శుద్ధి చేయునదనియు వేదము కీర్తించును.

"అథ ఆప ఆచమ్య బాహ్యాభ్యన్తరతః పూతో మేధ్యో యజ్ఞియో భూత్వా" జలముతో ఆచమనము చేసి బాహ్యాభ్యంతర శుచుడవై, పవిత్రుడవై, సంస్కారవంతుడవై యజ్ఞము చేయ యోగ్యుడవు కావలెనని బోధాయన గృహ్యసూత్రము (1-3-2) నిర్దేశించుచున్నది. కనుక ఈ క్రింది మంత్రములతో ముమ్మారు జలముతో ఆచమనము చేసి అగ్నిహోత్రము నారంభించాలి.

## ఆచమన మంత్రములు

ఓం అమృతోపస్తరణమసి స్వాహా

హే సర్వసంరక్షక పరమేశ్వర ! (అమృత) అవినాశుడవైన నీవు (ఉపస్తరణమ్ అసి) ఆసనమువలె మాకు ఆశ్రయమిచ్చుచున్నావు. (స్వాహా) ఇది యథార్థము - సత్యము.

ఓం అమృతాపిధానమసి స్వాహా

హే రక్షక ! అమృత స్వరూప ! నీవు అపిధానమువలె (పైన కప్పుకొను వస్త్రమువలె) మా చుట్టూ వ్యాపించియున్నావు. ఇది సత్యము.

ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా

హే రక్షక! అట్టి నీవు సత్యజ్ఞానమును, యశస్సును, ఐశ్వర్యమును, ఆనందమును నాయందు ప్రవహింపజేసి స్థిరముగా నుంచుము. నా ఈ ప్రార్థనను ఫలవంతము చేయుము.

ఋషులచే నిర్మింపబడిన పై ఆచమన మంత్రములు తైతరీయ ఆరణ్యకము నందును; అశ్వలాయన, మానవ గృహ్యసూత్రములందును మరికొన్ని గ్రంథములందును కాననగును. పై మంత్రములకు వినియోగపరముగా జలపరముగా అర్థము చెప్పుకొనవచ్చును. అప్పుడు ఓ జలమా! నీవు భూమిలోపల ఉండి మాకు ఉపస్తరణమువలె (కూర్చుండు ఆసనమువలె) ఉన్నావు. 2. ఓ అమృతమా! (జలమా) అపిధానమువలె మా చుట్టూ వాయుమండలమున నీటియావిరి రూపములో వ్యాపించియున్నావు. 3. అట్టి నీవు మాలోనికి ప్రవహించి, మా ఆత్మలను పవిత్రపరచి, సత్యమును యశస్సును ఐశ్వర్యమును ధరింప మమ్ము సమర్థవంతులజేయుము - అను అర్థము వచ్చును.

పాఠకులకు మనవి - ఈ లఘుగ్రంథమునందు అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపమును మాత్రమే సంక్షిప్తముగా తెలుపుటకు ప్రయత్నము జరుగుచున్నది. క్రియావిధానమును గురించి వివరించుట లేదు. క్రియా విధానమును తెలిసికొన గోరువారు మహర్షి దయానంద సరస్వతి గారి 'పంచమహాయజ్ఞవిధి' 'సంస్కార విధి' అను గ్రంథములను చూడగోరు చున్నాను.

ఆచమన క్రియ తదుపరి ఈ క్రింది మంత్రములతో అంగస్పర్శనము చేయుదురు.

ఓం వాజ్ మ ఆస్యే౭ స్తు (పెదవులను స్పృశింపవలెను)

హే పరమేశ్వర ! నా నోటియందు వాక్శక్తి స్థిరముగానుండునట్లు అనుగ్రహింపుము.

ఓం నసో ర్మే ప్రాణో౭ స్తు (నాసికా ఛిద్రములను)

నా యొక్క నాసికా రంధ్రములందు ప్రాణశక్తి స్థిరముగా నుండును గాక !

ఓం అక్ష్ణో ర్మే చక్షురస్తు (కన్నులను)

నా నేత్రములందు చక్షుశక్తి (చూడగలశక్తి) స్థిరముగా నుండును గాక !

ఓం కర్ణయో ర్మే శ్రోత్రమస్తు (చెవులను)

నా చెవులయందు శ్రవణశక్తి స్థిరముగా నుండును గాక !

ఓం బాహ్వో ర్మే బలమస్తు (భుజములను)

నా యొక్క బాహువులయందు బలము స్థిరముగా నుండును గాక !

ఓం ఊర్వో ర్మ ఓజో౭ స్తు (ఊరువులను-తొడలను)

నా తొడలయందు పరాక్రమము స్థిరముగా నుండును గాక !

ఓం అరిష్టాని మే ౭ఙ్గాని తనూ స్తన్వా మే సహసంతు

(శరీరముపై జలమును చల్లుకొనవలెను)

హే రక్షక ! వివిధ అంగములతో కూడిన ఈ శరీరమును, అవయవములను రోగరహితములై ఉండునట్లు అనుగ్రహింపుము.

పై మంత్రములతో అందలి అర్థమును భావన చేయుచు ఆ

యా యింద్రియములను చల్లని నీటితో స్పృశింపవలెను. చల్లని నీటితో స్పృశించుటవలన ఆ యా యింద్రియములలో జాగృతికలుగును. అవి బలపడును. ప్రార్థన వలన పరమేశ్వరుని సహాయము లభించును. సంకల్పించిన ధార్మిక కర్మ నిర్విఘ్నముగా చేయగల శారీరకశక్తి, మానసిక శక్తి లభించును.

తదుపరి యజ్ఞకుండమునందు అగ్న్యాధానము చేసి అగ్నిహోత్రము నారంభింపవలెను. అగ్నిహోత్రమునందు ముఖ్యముగా మూడు వస్తువుల వినియోగము జరుగును. అవి – సమిధలు, నెయ్యి, హోమ ద్రవ్యములు. ఇవి మనకు ఏ ఆధ్యాత్మిక సందేశముల నిచ్చుచున్నవో సంక్షిప్తముగా తెలిసికొందము.

## సమిధలు

అగ్నిహోత్రమున కుపయోగపడు కట్టెలను సమిధలు అందురు అగ్నిహోత్రమునకు సమిధలుగా చందనము, మోదుగ, జమ్మి, రావి, మఱ్ఱి, మేడి, మామిడి మొదలగునవి మంచివి. అవి బాగా ప్రాతవి, పుచ్చినవి దుర్గంధముతో నుండునవి కాకూడదు. పై పట్టతో కలిసియుండుట మంచిది. పూర్తిగా శుష్కించిన వాటికన్న కొద్ది పచ్చివిగా నున్నవే శ్రేష్ఠము.

ఈ సమిధలను మూడు రకములుగా విభజించిరి. అవి (1) సామిధేనీ సమిత్ (2) ఇధ్మములు (3) పరిధులు. వీటిలో మొదటి సామిధేనీ సమిత్‌లనే సమిధలని పేర్కొనుట జరుగుచున్నది. ఇవి అంగుష్ఠ మాత్ర లావుగలగి 8 అంగుళముల పొడవుగలిగి ఉండును. పై పట్టతోకూడి వంకరలు లేనివిగా నుండవలెను. ఇవి 3 అవసరము. రెండవవి ఇధ్మములు. ఇవి సమిధలకన్న రెట్టింపు లావుగాను, రెట్టింపు

పొడవుగాను ఉండవలెను. అనగా రెండు బ్రొటన వ్రేళ్ళు కలిసినంత లావు 16 అంగుళముల పొడవు ఉండవలెను. ఇవి 18 ఉండును. మూడవవి పరిధులు. ఇవి సమిధలకన్న 3 రెట్లు పెద్దవిగా నుండును. అనగా మూడు బ్రొటనవ్రేళ్ళు కలిసినంత లావు, పొడవు సుమారు మూరెడు (18 అం॥ లేక మరి కొంత ఎక్కువగా) ఇట్టివి 3. వీటిలో సమిధలుగా వ్యవహరింపబడు సమిధానీ సమిత్‌లు ముఖ్యమైనవి. మిగిలిన ఇధ్మములు, పరిధులు అగ్నికుండములో అగ్ని చల్లారిపోకుండా కాపాడుట కొరకు ఉపయోగపడుచుండును.

అగ్నిహోత్రంలో ముఖ్యంగా 3 సమిధలు మంత్రపూర్వకముగా అగ్నికుండములో ఉంచబడతాయి. ఆ మూడు సమిధలు సరిగా 8 అంగుళముల పొడవు గలిగి ఉండాలనే నియమం ఉంది. ఎక్కువ తక్కువలుంటే హానికరమని హెచ్చరించబడింది. దీని వెనుక కొన్ని ఆధ్యాత్మిక రహస్యాలు ఇమిడి ఉన్నాయి. ఇవి మన జీవన యజ్ఞంతో ముడిపడి ఉన్నాయి. శతపథ బ్రాహ్మణములో (1-5-4-1) లో సమిధల గురించి చెబుతూ - **స వై సమిధో యజతి ప్రాణో వై సమిధః** అని చెప్పడింది. అనగా యజ్ఞములో యజ్ఞకర్త ఏ సమిధలను ఆహుతిగా నిచ్చుచున్నాడో అవి ప్రాణరూపమైనవి. ఏలనన ప్రాణములు నిశ్చయముగా సమిధలే.

పై శతపథ బ్రాహ్మణ వాక్యములోని భావ మేమన మన శరీరమునకు (జీవనమునకు) ప్రాణము లెట్లు ఆధారమో అట్లే అగ్నికి సమిధలు ఆధారము. సమిధల ఆధారంగానే అగ్ని జ్వలించుచుండును. (అట్టి అగ్నిలో ఘృత హోమద్రవ్యములను ఆహుతులుగావేసి వాటిని వాయురూపముగా మార్చుచుందుము). సమిధలు లేకున్న అగ్ని జ్వలించదు. అట్లే ప్రాణము లేకున్న శరీరము జీవించదు. ఆ ప్రాణము

మన శరీరములో 8 అంగుళముల పరిమాణములో ఉన్నప్పుడే మన జీవనము చక్కగా జరుగును. లేకున్న ఆరోగ్యము క్షీణించి శరీరము పురుషార్థము చేయుటకు అసమర్థమగును.

మన శరీరములో ప్రాణసంచారము జరుగుచుండుట మనందరకు తెలిసిన విషయమే. అది అందరిలో సమానముగా కాక వేరువేరు పరిమాణములలో సంచరించుచున్నది. వాటిని మన ఋషులు జాగ్రత్తగా పరిశీలించగా 4 అంగుళముల, 8 అంగుళముల, 12 అంగుళముల, 16 అంగుళముల పరిమాణములలో ప్రాణము సంచరించుచున్నట్లు గుర్తించిరి. మన శరీరములో అగ్నితత్త్వము ప్రధానముగా నునపుడు 4 అం. పరిమాణముతోను, వాయుతత్త్వము ప్రధానముగా నున్న 8 అం. పృథివీ తత్త్వము ప్రధానమైనచో 12 అం॥ జల తత్త్వము ప్రధానమైన 16 అం. పరిమాణములో ప్రాణ సంచారము జరుగుచున్నట్లు కనుగొనిరి.

శ్వాస పరిమాణమును గుర్తించుటెట్లన – వాయువు సహజముగా అడ్డముగా వీచును. కాని, మన శరీరములో పైకి క్రిందికి (లోపలకు వెలుపలకు) ప్రవహించును. అట్టి శ్వాసయొక్క వేగాన్నిబట్టి ఈ పరిమాణములు లెఖ్కించబడును.

వీటిలో 8 అంగుళముల పరిమాణముగల వాయుతత్త్వ శ్వాస మన శరీరానికి అనుకూలముగా నుండును. ఈ పరిమాణముకన్న ఎక్కువ తక్కువలుగా నడిచినచో ఆరోగ్యములో మార్పులు జరుగును. ఒకవేళ 4 అంగుళముల పరిమాణములో శ్వాస నడిచినచో పిత్తము ప్రకోపము చెంది ప్రాణశక్తిని క్షీణింపజేయును. అట్లే మనకు క్రోధము కలిగినపుడు లేదా జ్వరము వచ్చినపుడు మన శరీరములో పిత్తము

ప్రకోపము చెందును. అప్పుడు శ్వాస వేగముగా హ్రస్వముగా 4 అంగుళాల పరిమాణములో నడుచుట చూడగలము. మన శ్వాసకు ప్రతినిధిగా అగ్నిహోత్రములో సమిధను ఉంచుట జరుగుచున్నది. అందుచే అది 8 అంగుళముల పరిమాణములోనే ఉండవలెనని నియమ మేర్పరచిరి. తక్కువ పరిమాణములో నున్నచో ("హ్రస్వాయాం వ్యాధి మాప్నోతి', "కృశాయాం యాజక క్షయః") వ్యాధిని ఉత్పన్నము చేయుననియు, అంగుష్ఠ పరిమాణముకన్న సన్నగా నున్నచో క్షయవ్యాధి వంటి కృశత్వ వ్యాధిని కలిగించు ననియు చెప్పబడినది. అట్లే ఎక్కువ పొడవు ఉన్నచో (దోషం ప్రకుర్వతే దీర్ఘా') జల పృథివీ తత్త్వములు ప్రకోపించి కఫదోషాదులను కలుగుజేయు ననియు చెప్పబడింది.

ఇంతేగాక, వేదమంత్రములలో ముఖ్యమంత్రముగా భావించు గాయత్రీ మంత్రమునకు, గాయత్రీ ఛందస్సునకు ప్రతీకగా 8 అంగుళాల సమిధను ఏర్పరచిరని కొంద రందురు. గాయత్రీ మంత్రములో ఎనిమిదేసి అక్షరములుగల మూడు పాదము లందును. దానికి ప్రతీకగా ఎనిమిదేసి అంగుళముల పరిమాణముగల మూడు సమిధలను అగ్నిహోత్రములో ఆధానము చేయుట జరుగుచున్నది. గాయత్రీ మంత్రమునకు దేవత 'సవిత'. ఆ సవితా దేవతయే (పరమాత్మయే) మిగిలిన దేవతలన్నిటిని ప్రసవించుచున్నది. అందుచే గాయత్రీ మంత్రముతో సవితా దేవత కర్పించు ఆహుతి మిగిలిన దేవతల కన్నటికిని చేరుననియు చెప్పుదురు. వేదము

"స గాయత్ర్యా త్రిష్టుభా ఽనుష్టుభా చ దేవేభ్యో
హవ్యం వహతు ।" (యజుర్వేదము 13-34)

ఈ అగ్ని గాయత్రీ, త్రిష్టుప్ మరియు అనుష్టుప్‌ల ద్వారా దేవతలకు హవిస్సును చేర్చు నని చెప్పును.

శతపథ బ్రాహ్మణము "యా గాయత్ర్యా...... దేవేభ్యో యజ్ఞం వహతి" (1-3-1-6) గాయత్రీ ద్వారా..... దేవతలకొరకు యజ్ఞమును ధరించుచున్నది.

సమిధలు అష్టాంగుళ పరిమాణములోనే ఉండాలనుటకు కొందరు మరొక కారణము చెప్పుదురు. కొలత బద్దలు ఏవీ దగ్గరలో లేనపుడు మనం ఏదైనా వస్తువుయొక్క పొడవు వెడల్పులు కొలవవలసివస్తే జానలతోను, లేదా మూరలతోను కొలస్తూ ఉంటాము. చివర మిగిలిన భాగాన్ని బెత్తెలతోను, వ్రేళ్ళతోను కొలుస్తాము. వీటిలో బెత్తలతో కొలవటం ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. ఏలనన కుడిచేతి బెత్త వెంట ఎడమచేతి బెత్త దానివెంట కుడిబెత్త పెడుతూ పొరబాటు లేకుండా ఆ వస్తువు యొక్క పొడవును కొలవగలుగుతాము. సమిధ అష్టాంగుళ పరిమాణ మనగా రెండు బెత్తలు లేక అష్ట అంగులీయముల పరిమాణ మని గ్రహించవలెను. అష్ట పదము 'అశూజ్ - వ్యాప్తౌ' అను ధాతువుతో నిర్మించబడుతుంది. కాన, అష్ట పదమునకు వ్యాపించేది లేదా ఆక్రమించేది అని అర్థం వస్తుంది. కుడి ఎడమ బెత్తలు 4+4 అంగులీయములు వస్తువుయొక్క పొడవులో వ్యాపిస్తూపోయి పూర్తిగా ఆక్రమిస్తాయి. అట్లే అష్టాంగులీయముల సమిధలను మన రెండు గుప్పిట్లలోను ఆక్రమించుకోవచ్చును. అనగా అది మన గుప్పిటిలో (మన వశంలో) ఉన్నట్లు అవుతుంది. అట్లే అష్టాంగుళ పరిమాణం ఆ సమిధ పూర్తిగా తన వశంలో ఉన్నట్లు తెలుపుతుంది. ఆహుతి యిచ్చే పదార్థం పూర్తిగా యజమానుని స్వార్జితమై అతని వశంలో ఉండేది కావాలని సూచిస్తుంది. పూర్ణ పురుషార్థం చేసి న్యాయమార్గంలో అష్టఐశ్వర్యాలను సంపాదించి ఆనందించ మంటుంది.

వేదమాత సూచించే అష్టైశ్వర్యాలు ఎవ్వి యన-స్తుతామయా

వరదా వేదమాతా - ప్రచోదయంతాం పావమానీ ద్విజానామ్ । (1) ఆయుః, (2) ప్రాణమ్, (3) ప్రజామ్, (4) పశుమ్, (5) కీర్తిమ్, (6) ద్రవిణమ్, (7) బ్రహ్మవర్చసమ్, (8) మహ్యం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్ ॥ (అథర్వ వేదము. 19-71-1)

దీర్ఘమైన ఆయువు, బలిష్టమైన ప్రాణశక్తి, ఉత్తమ సంతానము, గో అశ్వాది పశుసంపద, గొప్ప కీర్తి, ఉత్తమ ఐశ్వర్యము, బ్రహ్మవర్చస్సు (ఓజో శక్తి) బ్రహ్మలోకము (ముక్తి) ఈ ఎనిమిది రకముల సంపదలను పొందవలెనని ప్రేరేపిస్తుంది.

బ్రహ్మచారి అష్టాంగుళ పరిమాణముగల 3 సమిధలను చేత నిడుకొని గురుచరణారవిందముల ఉపస్థితుడగును. అందు మొదటి సమిధ కర్మమయలోకమైన భూలోకమునకు చెందినది. అప్పుడు కాళ్ళు చేతులు, పాయు ఉపస్థలు, వాక్ ఉదరములు కలిసి 8 అగును. రెండవ సమిధ భువర్లోకమునకు సంబంధించినది. ఇది సూక్ష్మ శరీరమును సూచిస్తుంది. పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి చిత్తము అనునవి అందలి ముఖ్యభాగములు. మూడవ సమిధ ద్యులోకమునకు చెందినది. ఇవి హృదయగత భావములైన ఆభాసము, ఆవేశము, ఆవేగము, సంకల్పము, వ్రతము, దీక్షా, శ్రద్ధ అను అష్ట అంగుళీయములను సూచిస్తాయి.

ఈ విధముగా బ్రహ్మచారి తన స్థూల సూక్ష్మకారణ శరీరములకు ప్రతీకలుగా మూడు సమిధలను తీసికొని గురువుగారి వద్దకు వెళ్ళి తనను తాను అర్పించుకొనెడివాడు. గురువు జ్ఞాన మను అగ్ని. అట్టి జ్ఞానాగ్నిలో తనను తాను జ్వలింపజేసికొని ప్రదీప్త మయ్యెడివాడు. అందుచే మూడు సమిధలతోనే బ్రహ్మచారి చేయవలసిన

అగ్నిహోత్రము పూర్తి అవుతుంది.

ఈ విధముగా అష్టాంగుళ పరిమాణ సమిధలు మరెన్నో ఆధ్యాత్మిక భావములను తెలుపునని ఋషులు చెప్పుదురు.

## ఘృతము (ఆజ్యము - నెయ్యి)

యజ్ఞకుండములో అగ్నిని ఆధానముచేసి సమిధలతో ప్రదీప్తము చేసిన తదుపరి దాని దీప్తి తగ్గకుండా నిలబడుటకు ఆజ్యమును ఆహుతులుగా నివ్వవలసి యుండును. ఇధ్మ (సమిధలు) ద్వారా ఇద్ధ అగ్ని, ఘృతము ద్వారా సమిద్ధ అగ్ని, హవి (హోమ ద్రవ్యములు) ద్వారా సుసమిద్ధ అగ్ని నిర్మింపబడును. దానివలన యజ్ఞకర్త స్వయంగా ఆకర్షితుడై తన ఆత్మను ఇధ్మముగా చేసుకొని సమాజరూప యజ్ఞాగ్నిలో ఆహుతి యగుటకు సిద్ధపడును.

అగ్ని సదా దీప్తి మంతముగా నుండుటకు, సుసమిద్ధ మగుటుకు ఏ సాధనము అవుసరమో అదియే ఘృతము లేదా ఆజ్యము. సమిధలు అగ్నిని దీప్తిమంతము చేయును. ఆ దీప్తిని వృద్ధిపరచి సుసమిద్ధము చేసి నిర్ధూమముగా నుంచుటకు ఆజ్యము అవసరము. అగ్నికి ఆజ్యము ప్రాణము వంటిది. అది దానిని జీవింపజేయు అద్భుత రసము.

ఘృతపదము 'ఘృ - క్షరణ దీప్తయోః, అను ధాతువుతో నిర్మింపబడును. కాన (1) స్రవించేది (2) ప్రకాశించేది అని దీని మూలార్థాములు (రూట్ మీనింగ్స్) రెండు. సమిధలు అగ్నికి ఆధారములైనను అవి స్వయం ప్రకాశకములు కావు. ఘృతము అట్లుకాక అది స్వయంప్రకాశకము. దాని సంపర్కములోనికి వచ్చు వాటినికూడా అది ప్రకాశింపచేస్తుంది.

ఘృతమునకు స్నేహము అని మరొక పేరు. దానిలో స్నేహ

గుణము ఉంటుంది. నీరు పిండి అణువులను కలిపి ముద్దగా చేయునట్లే ఘృతముకూడ చేయగలదు. స్నేహము రెండు వస్తువులను ఒకటిగా చేయగల అద్భుత గుణము. అది రెండు హృదయములను స్రవింపజేసి ఒకటిగా చేసి స్నేహితులను చేయగలదు. మైత్రీ యజ్ఞమును నిర్వహింపగోరు వ్యక్తులు ముందుగా వారి చక్షురింద్రియ మను పాత్రలో ఘృతమును నింపుకొని వత్తురు. వారి నేత్రములనుండి ఆనందాశ్రువులు స్రవించగా వారు స్నేహితులగుదురు. అంత చిన్న అక్షిపాతత్రలోకూడా అక్షయ స్నేహ భండార మున్నది.

విశ్వతోధారయజ్ఞ దీక్షితుడైన సంన్యాసివద్ద ఉండునది ఈ ఘృత భండారమే. స్నేహభండారమే. దానితో ఆ సంన్యాసి విశ్వతోధార యజ్ఞము చేయుచు లోకమున సంచరించును. సర్వప్రాణులను మిత్రదృష్టితో చూచుచు వారి ఉన్నతికై పాటుపడును. సంన్యాసి వద్ద అగ్నిహోత్రమునకు అవసరమైన ఘృతాదు లెచటనుండి వచ్చును ? పాత్ర లెచటనుండి వచ్చును? అతనికి అతని నేత్రములే అక్షయపాత్ర. మిత్రదృష్టియే ఘృతము. అందుండి వెలువడు అక్షయ ఘృతధారలు అన్ని బంధనములను త్రెంచుకొని ప్రాణిమాత్రులందరిపై వర్షించును. అతని సత్యజ్ఞానరూప ఘృతము దుఃఖిత పీడిత దీన జనావళి యొక్క శ్రద్ధారూప అగ్నిలో నిరంతరము ఆహుతి యగుచుండును. సదా విశ్వతోధార యజ్ఞము సంపన్న మగుచుండును. వీరి స్నేహా శ్రు బిందువు లెచ్చటెచ్చట పడునో అచ్చటచ్చట ఒక అశ్వమేధ యజ్ఞము సంపన్నమగునని (యద్వైతదశ్రుసంక్షరితమాసీదేష సో౽ అశ్వః అని శతపథ బ్రాహ్మణము (6-3-1-18) చెప్పును. సంన్యాసుల గురించి వేదము -

"స్వర్యన్తో నాపక్షన్త ఆ ద్యాం రోహన్తి రోదసీ ।

యజ్ఞం యే విశ్వతోధారం సువిద్వాంసో వితేనిరే ॥

(అథర్వ వేదము-4-14-4)

ఏ సువిద్వాంసులైన సంన్యాసులు విశ్వతోధార యజ్ఞముచేయుచు విశ్వము నాలింగనము చేసుకొందురో వారు ద్యులోకము నధిరోహింతురు. పరమేశ్వరుని ఆనందలోకమున (స్వర్లోకమున) విహరింతురని చెప్పును

అగ్నిహోత్రమున సమిధలు పచ్చిగా నుండుటవలన గాని, హోమద్రవ్యములు ఎక్కువగుటవలన గాని మరే కారణమువలన గాని అగ్ని మందగించుచుండును. అప్పుడు కొన్ని ఘృత ఆహుతుల నిచ్చినచో అగ్ని ఉద్దీపన చెందును. ప్రజ్వరిల్లును. వికసించును. అట్లే నీవు దుఃఖిత పీడిత ప్రజలపై స్నేహ ధారలు కురిపించినచో వారి ముఖములు వికసించును. బాధలు ఉపశమించును. నీపట్ల వారు కృతజ్ఞత కలిగియుందురు. దానివలన నీకును ఆనంద మగును. తృప్తి కలుగును. స్నేహ ఘృతము రెండువైపుల స్రవించును. అది దాని స్వభావము.

మైత్రీభావన రెండువైపులనుండి ప్రసరించవలె ననియే వేదము చెప్పును.

దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షన్తామ్ ।
మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే ।
మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥ (యజుర్వేదము, 36-18)

హే దృతే ! అవిధ్యాంధకార నివారక ప్రభో ! నీ కృపవలన సమస్త ప్రాణులు నన్ను మిత్రదృష్టితో చూచును గాక !

మేమందరము పరస్పరము మిత్రదృష్టితోనే చూచుకొనుచు అట్లే వ్యవహరించుకొనుచు ఉందుము గాక. మమ్ము ఈ మైత్రీవ్రతమున దృఢ

చిత్తుల జేయుము" అని నిత్యము పరమేశ్వరుని ప్రార్థించాలి.

అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతం మే చక్షు
రమృతం మ ఆసన్। (యజు. 18-66)

నేను జ్ఞానప్రకాశమును బొంది సదా నా చక్షువులందు ఘృతమును - స్నేహమును (మైత్రీభావనను), నా వాక్కునందు అమృతమును (మాధుర్యమును) కలిగియుందును గాక " యని సంకల్పం చేయాలి.

ఘృతము నుండి మనము నేర్చుకోవలసిన మరొక ముఖ్య పాఠం దీప్తి. ఘృతము తాను ప్రకాశిస్తూ ప్రపంచాన్ని ప్రకాశింపజేస్తుంది. అట్లే మన జీవితము దీప్తవంతము కావాలి. సద్గుణాలతో మనము ప్రకాశిస్తూ లోకాన్ని ప్రకాశింపజేయాలి. విద్యా విజ్ఞానాలతో మనము వర్ధిల్లి ఇతరులను వర్ధిల్లజేయాలి. అగ్నిహోత్రములో ఐదు పర్యాయములు ఘృతమును ఆహుతిగానిస్తూ మమ్మును వర్ధిల్ల జేయుమని జాతవేద భగవానుని ప్రార్థిస్తాము.

అయం త ఇధ్మ ఆత్మా జాతవేద
స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్
ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే
నాన్నాద్యేన సమేధయ - స్వాహా

-అశ్వలాయన గృహ్యసూత్రాలు (1-1-12)

ఓ జాతవేదాగ్నీ ! నేను ఆహుతిగా నిచ్చు ఈ ఇధ్మము (దీప్తిని గలిగించు ఘృతము) నీకు ఆత్మ. కావున, దీనిచే నీవు గొప్పగా ప్రకాశింపుము. మిక్కిలిగా ప్రజ్వరిల్లుము. నీవలె మమ్ముకూడ ఉత్తమ సంతానముతోను, గో అశ్వాది పశుగణముతోను, బ్రహ్మవర్చస్సుతోను -

వేద జ్ఞానముతోను, అన్నాది పదార్థముల ననుభవించగల ఇంద్రియ పటుత్వముతోను, శారీరక ఆత్మిక ఉన్నతులతోకూడిన సర్వతోముఖ వృద్ధితోను మమ్ము వర్ధిల్లజేయుము. స్వాహా-మా యీ కథనము సత్యమగు గాక ! శ్రద్ధతో మే మిచ్చు ఆహుతిని స్వీకరింపుము.

ఘృతాహుతిని స్వీకరించి అగ్ని వర్ధిల్లును. మిక్కిలిగా ప్రకాశించును. అట్లే మనమును పూర్ణపురుషార్థము చేసి ఉన్నతిని చెందాలి. మనం మన ఉన్నతితోనే సంతృప్తి చెందక అందరి ఉన్నతి కొరకు పాటుపడితే మిక్కిలిగా ప్రకాశించగలం. మనం సాధించవలసిన ఉన్నతి అయిదురకాలుగా ఉండాలని ఈ మంత్రం సూచిస్తున్నది. అందుకొరకు ప్రయత్నించాలి. నిత్యం అగ్నిహోత్రం చేస్తూ ఇటువంటి మంత్రాలద్వారా ప్రేరణను బొందుచూ పురుషార్థం చెయ్యాలి. ఘృతైర్బోధయత - ఘృతముతో అగ్నిని వృద్ధిచేస్తూ మనంకూడా వర్ధిల్లాలి.

అగ్ని సంపర్కము వలననే ఘృతమునకు క్షరణ దీప్తి గుణాలు వస్తాయి. గడ్డకట్టిన నెయ్యి అగ్ని సంయోగమువలన క్షరిస్తుంది (స్రవిస్తుంది). అగ్నిలోపడి ప్రకాశిస్తుంది. అగ్నినికూడ ప్రకాశింపజేస్తుంది. అందుచేతనే శతపథ బ్రాహ్మణం 'అగ్నేయం వై ఘృతమ్' - (7-1-8-14) అని చెబుతుంది. "యాతద్వా అగ్నేః ప్రియం ధామ యద్ ఘృతమ్' అని తైత్తరీయ సంహిత చెబుతుంది.

మీరు భౌతికాగ్నిహోత్రం చేయ వీలుపడకుంటే శ్రద్ధారూప అగ్నిలో సత్యరూప ఆజ్యం ఆహుతిగా యివ్వండి. 'అసతో మా సద్గమయ' అని ప్రార్థించండి. ఘృతైర్ బోధయత ! సత్యేన బోధయత !

## హవ్యము (హోమ ద్రవ్యములు)

హవ్యము లేకుండా అగ్నిహోత్రము సంపన్నము కాదు. హవిర్ ద్రవ్యములలో ఘృతము ప్రధానమైనది. ఘృతము లేకుండా కేవల హోమద్రవ్యములతో అగ్నిహోత్రము చేయుట అంతమంచిది కాదు. అనివార్య పరిస్థితులలో యాజ్ఞవల్క్య మహర్షి సూచించినట్లుగా వ్రీహియవాదులతో, వనస్పతులతో కొద్దికాలము ఆపద్ధర్మముగ్గా చేయవచ్చును. ఏమైనను ఘృతము ప్రధానమైనది. హోమద్రవ్యములు గౌణమైనవి. వేదములో -

సమిధాగ్నిం దువస్యత, ఘృతైర్ బోధయత ।
**ఆస్మిన్ హవ్యా జుహోతన ॥ (యజుర్వేదము. 3-1)**

"సమిధలతో అగ్నిని ప్రజ్వలితము చేసి, ఘృతముతో వర్ధిల్ల చేసి, ఆ విధంగా వర్ధిల్లిన అగ్నిలో హవ్యద్రవ్యాలను (ఆ జుహోతన) చక్కగా ఆహుతు లివ్వండి" అని పరమేశ్వరుని ఆదేశం. ఆ హవ్యము ఎట్లుండవలె నన్న -

త్ర్యంబకం యజామహే సుగన్ధిం పుష్టి వర్ధనమ్ ।
ఉర్వారుక మివ బంధనాన్ మృత్యోర్ ముక్షీయ మా అమృతాత్॥
(యజుర్వేదము. 3-60)

ఈ మంత్రమునందు మొదటి పాదములో త్రిలోకాధిపతియైన పరమేశ్వరుని రెండు గుణములు వర్ణింపబడినవి. అవి సుగంధయుక్తము, పుష్టివర్ధకము. రెండవ పాదములో మృత్యుబంధనము నుండి విడిపించి అమృతత్త్వమును ప్రాప్తింపజేయు మను ప్రార్ధన కలదు. రోగములు మృత్యువువంటివే. ఇక అమృతత్త్వము మధురమైనది. కాన హోమ ద్రవ్యములలో ఈ నాలుగు గుణములు ఉండుట మంచిది. ఈ వైదిక

దృష్టికోణముతోనే మహర్షి దయానంద సరస్వతిగారు తమ "సంస్కార విధి"నామక గ్రంథములో నాలుగు రకముల హోమద్రవ్యములను సూచించిరి.

అవి ఎవ్వియన -

**1. సుగంధితములు** : కస్తూరి, కేసరి, అగరు, తగరు, శ్వేత చందనము యాలకులు, జాజికాయలు, జాపత్రి మొదలగునవి.

**2. పుష్టి కారకములు** : ఘృతము, పాలు, ఎండిన పండ్లు, కందమూలములు, బియ్యము, గోధుమలు, బాదం, అక్రోటు, ద్రాక్ష మొ॥ నవి

**3. రోగనాశకములు** : సోమలత లేదా తిప్పతీగ మొ॥నవి.

**4. మిష్ట పదార్థములు** : చక్కెర, బెల్లము, ఖర్జూరము, నేతి మిఠాయిలు మొ॥నవి.

ప్రాచీన ప్రామాణిక శాస్త్రములందును ఇట్లే యున్నది.

**సురభీణి సుపుష్టశ్చ కారకాణి సితాదికమ్ ।**

**ద్రవ్యాణ్యాదాయ జుహుయా చ్ఛతుర్థం రోగనాశకమ్ ॥**

ఈ శ్లోకమునందును ఋషి 1) సురభీణిః = సుగంధ యుక్తములు 2) సుపుష్టి = మంచి పుష్టికారకములు 3) సితాదికమ్=పటిక బెల్లము (మిస్రీ) మొదలుగ వానితోను 4) రోగనాశకమ్=రోగనాశక మూలికలతోను ఆహుతు లివ్వలెనని సూచించుచున్నాడు.

మహర్షి దయానందుడు ఈశ్వరీయ జ్ఞానమైన వేదములనే పరమ ప్రమాణముగా నంగీకరించును. ఆ తదుపరియే ఋషుల గ్రంథములకు ప్రాధాన్యాత నిచ్చును. ఏలనన కాలాంతరమున ఋషుల గ్రంథములలో కొందరు స్వార్థపరులు ప్రక్షిప్తములను చేర్చిరి. వాటిని తెలుసుకొని తొలగించవలెనన్న నాలుగు వేదములను క్షుణ్ణముగా అధ్యయనముచేసి

యుండవలెను. ఇంతేగాక, పరిశుద్ధమైన హృదయముతో పరమాత్ముని ఉపాసనచేసి సమాధిస్థితిని బొంది యుండవలెను. అప్పుడే వేదార్థము చక్కగా అవగత మగును. అప్పటికీ ఏమైనా సందేహములు వచ్చినచో మరల సమాధి స్థితిలోనికి పోయి పరమేశ్వరుని ద్వారా ఆ సందేహముల నివృత్తి చేసుకొనగల సామర్థ్యము కలిగి యుండవలెను. ఈ అన్నియోగ్యతలు కలిగిన మహాపురుషుడు మహర్షి దయానందుడు. కనుక వారు సూచించిన విధిని అనుసరించుటయే ఉత్తమం.

అయితే మహర్షి యాజ్ఞిక విధానములో షోడశ సంస్కారాల వరకే వ్రాయగలిగిరి. ఆ తదుపరి కొందరు స్వార్థపరులు ఆయనకు విషమిచ్చి చంపివేసిరి. అందుచే బ్రాహ్మణ గ్రంథములలో సూచించిన వివిధ శ్రౌత యజ్ఞముల విధి విధానములను వ్రాయలేకపోయిరి. ఆ కారణముచే వివిధ యజ్ఞములలో ఉపయోగించవలసిన హోమద్రవ్యము లెవ్వియో స్పష్టంగా తెలియుట లేదు.

ప్రాచీన శాస్త్రములలో అనేక కామ్యయజ్ఞముల ప్రస్తావన కనబడును. వర్షేష్టి, పుత్రకామేష్టి, ఆరోగ్యేష్టి మొదలగునవి చేయబడుచుండెడివి. మహర్షి వేదభాష్యము నందును ఇట్టి సంకేతములు కనబడును. యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుడును యజ్ఞమును కామధేను వనెను.

**సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వాపురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వ మేషవో౽స్త్విష్ట కామధుక్ ॥**

**- భగవద్గీత (3-10)**

సృష్ట్యారంభమున ప్రజాపతియైన పరమేశ్వరుడు యజ్ఞముతో బాటు ప్రజలను సృజించి "ఈ యజ్ఞములతో మీరు వృద్ధిని బొందుడు.

ఇవి మీ కోరికలను తీర్చు కామధేనువు" లనెను.

ప్రఖ్యాత ఆర్యవిద్వాంసులు కీ.శే. పం. వీరసేన్ వేదశ్రమి గారు కామ్యయజ్ఞములను గురించి లోతుగా అధ్యయనముచేసి వర్షేష్టి. పుత్రకామేష్టి, రోగనాశకయిష్టి మొదలగునవి చేయించెడివారు. వాటివల్ల ప్రశంసించదగిన ఫలితములే కలిగినవి. వారి అధ్యయనములో గుర్తించిన కొన్నిరకముల హోమద్రవ్యములను తమ 'యాజ్ఞిక ఆచార సంహిత'లో తెలిపిరి. అవి –

1. శాంతి కర్మలో – ఆవుపాలు, ఆవునెయ్యి, పిప్పలాది వృక్షముల ఆకులు, తిప్పతీగ
2. పుష్టికర్మలో – బిల్వపత్రములు, ఆవునెయ్యి, మల్లెపూవులు
3. సమృద్ధికొరకు – ఆవుపెరుగు లేదా ఆవు నెయ్యి
4. దీర్ఘాయువుకు – ఆవునెయ్యి, నువ్వులు, దుర్వా (గరిక వేళ్ళు), పత్రములు, మామిడి ఆకులు
5. జ్వరము తగ్గుటకు – మామిడి ఆకులు
6. మృత్యువును దూరము చేయుటకు (అనగా నయముకాని వ్యాధితో నున్నవారి జీవితం పొడిగించుటకు) – తిప్పతీగ
7. గోవుల రోగములకు – తెల్ల ఆవాలు
8. వర్షముల కొరకు – ఫేము.బెత్తపు చెట్టు సమిధలు మరియు వాటి ఆకులు
9. అతివృష్టి నివారణకు – ఆవుపాలు, ఉప్పు

ఇట్లే మరెన్నో రకముల హోమ ద్రవ్యముల ప్రస్తావన శాస్త్రములందు కనబడును. వీటిని గురించి పరిశోధించవలసి యున్నది.

దైనిక అగ్నిహోత్రములోను, షోడశ సంస్కారాలలోను మహర్షి సూచించిన 4 రకముల హోమద్రవ్యములు సరిపోవును. అవియును కొద్ది పరిమాణములోనున్న చాలును. వాటిని అగ్నిహోత్ర ప్రారంభములోనే ఆహుతిగా నివ్వరాదు. ముందు నేతి ఆహుతులతో అగ్నిని సుసమిద్ధము చెయ్యాలి. బాగా ప్రజ్వరిల్లిన అగ్నియందే హోమ ద్రవ్యములను ఆహుతిగా యివ్వాలి. అగ్నిహోత్రవిధి ఆ విధముగా రూపొందించబడినది. కాన, ఆ విధిని అనుసరించుటయే ఉత్తమం.

శతపథ బ్రాహ్మణం 11వ కాండములో మానవునకు ఏ విధంగా బాల్య వృద్ధావస్థలు ఉండునో అదే విధంగా అగ్నిహోత్రమునకును బాల్య వృద్ధావస్థలు ఉండునని చెప్పబడింది. ఎట్లు శిశువునకు ద్రవాహారమైన పాలతో ప్రారంభించి క్రమంగా ఘణాహారము నిత్తుమో అట్లే అగ్నికి ద్రవాహార సదృశమైన నేతితో ప్రారంభించి తదుపరి ఘణాహారమువంటి హోమ ద్రవ్యములను ఆహుతులుగా యివ్వాలి. ఎట్లు మానవునకు వృద్ధావస్థలో జీర్ణశక్తి క్రమంగా తగ్గి ద్రవాహారములు అనుకూలముగా నుండునో అట్లే అగ్నిహోత్ర చివరిభాగమున నేతితో ఆహుతి లిచ్చుట అనుకూలముగా నుండును. ఆ ఘృతముకూడా కరిగినదిగా ఉండాలి. కొద్ది వేడిగా నుండుట యింకను మంచిది. "ఘృతం తీవ్రం జుహోతన' యని వేద సందేశం.

నాలుగురకముల హోమద్రవ్యములు మనకు నాలుగు రకముల ఆధ్మాత్మిక సందేశముల నిచ్చుచున్నవి. అందు మొదటివి సుగంధితములు. సుగంధము మనకు ప్రసన్నత నిచ్చుటయే గాక తోటివారికిని ప్రసన్నతను గలుగజేయును. మనము భౌతిక సుగంధమును వ్యాపింపజేయుటయేగాక ఆధ్మాత్మిక సుగంధమును కూడా వ్యాపింపచేయాలి. మనము సద్గుణ

సంపన్నులమై మన ఆత్మను సుగంధితము చేసుకోవాలి. ఆ యాత్మ సౌగంధమును లోకమున వ్యాపింపచేయాలి. ఆత్మను సుగంధితము చేయగల సద్గుణము లెవ్వియో సంక్షిప్తముగా యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు భగవద్గీత యందు చెప్పియున్నాడు. వాటికి దైవీసంపద యని పేరు పెట్టినాడు.

**అభయం సత్వ సంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥**
**అహింసా సత్య మక్రోధః +త్యాగః+శాంతి రపైశునమ్ ।**
**దయా భూతే ష్వలోలుప్త్వం మార్ధవం హ్రీ రచాపలమ్ ॥**
**తేజః క్షమా ధృతిః + శౌచం + అద్రోహో నాతి మానితా ।**
**భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత ! ॥**

(భగవద్గీత. 16-1-2, 3)

అభయం (ధర్మ కార్యముల నాచరించునపుడు నిర్భయముగా నుండుట), అంతఃకరణ శుద్ధి (మనోబుద్ధులయందు కపటము లేకుండుట), సదా జ్ఞానయోగమున దృఢముగా నుండుట, దానశీలత, ఇంద్రియ నిగ్రహము, యజ్ఞమయ జీవితం గడుపుట (లోక హితము కొరకు కర్మల నొనర్చుట), స్వాధ్యాయము (ధర్మ గ్రంథములను చదువుట) తపస్సు (సుఖదుఃఖ మానావమానాదులను ఓర్పుతో సహించుట), ఆర్జవమ్ (నిజాయతీగా నుండుట).

అహింస (మనోవాక్కాయములతో ఏ ప్రాణిని హింసింపకుండుట) సత్యము చెప్పుట, కోపింపకుండుట, త్యాగము, శాంతి, అపైశునం (చాడీలు చెప్పకుండుట), ప్రాణులయెడ దయ, లోభము లేకుండట (ఇతరులు సొమ్ము నాసించకుండుట), నమ్రత, చెడుపనులు చేయుటకు సిగ్గుపడుట,

చాంచల్యము లేకుండుట.

ప్రతాపము, క్షమాశీలత, ధైర్యము, బాహ్యాభ్యంతర శుద్ధి, వైరము లేకుండుట, ఎక్కువ అభిమానము లేకుండుట అను నివి యన్నియు దైవీసంపదలు.

ఈ దైవీ సంపదలే మానవుని సుగంధితుని జేయును. ఆ సుగంధము లోకమన వ్యాపించి మరెందరినో ప్రేరేపించి వారిని సుగంధితుల జేయును.

హోమ ద్రవ్యములలో రెండవవి పుష్టికారకములు. పాలు, పండ్లు, బాదం, అక్రోట్, పప్పులు, ధాన్యములు మొదలగునవి. ఇవి ఆహుతులుగా నిచ్చినపుడు అణువులుగా విడివడి గాలిలో కలియును. ఆ గాలిని పీల్చుకున్న ప్రాణులకు అవి పుష్టిని కలిగించును. వీటివలన మనకు, మన తోటివారికి మేలు జరుగును. ఇవి మన కొక ఆధ్యాత్మిక సందేశము నిచ్చుచున్నవి. పుష్టికరమైన ఆహార పానీయాదులను సేవించి బలిష్ఠులు కమ్మని అవి మనను ప్రేరేపిస్తున్నవి. వాటిని కేవలము మీరే భుజించక తోటివారికి కొంతపెట్టి వారి ఉన్నతికొరకుప్రయత్నించమని ప్రబోధిస్తున్నవి. పూర్వకాలమున క్రొత్తగా పండిన పంటలు ఇంటికి తీసుకువచ్చినపుడు ముందుగా నవసస్యేష్టి యజ్ఞము చేసెడివారు. అనగా ఆ క్రొత్త ధాన్యములతో ఆహుతుల నిచ్చెడివారు. పనివారలకు, వివిధ వృత్తుల వారికి, పేదలకు కొంతభాగము పంచెడివారు. ఆ తదుపరియే వారు వండుకొని భుజించెడివారు.

మూడవ వర్గము మిష్టములు (మధుర పదార్థములు). తేనె, చక్కర, బెల్లము, ఖర్జూరం ద్రాక్ష మొదలగు ఎండిన పండ్లు ఈ వర్గములోనికి వచ్చును. వీటిని అగ్నిహోత్రములో ఆహుతులుగా వేయుట వలన

మధురమైన కమ్మని వాసనలు వచ్చును. అవి ప్రాణులకు మాధుర్యమును, ప్రసన్నతను కలిగించును. యజ్ఞవిధిలో జరుగు అతి న్యూనతా (ఎక్కువ తక్కువ) లోపములను సమరసపరచి ఏ ప్రాణికి హానికలుగకుండునట్లు కాపాడును. బృహద్ యజ్ఞవిధిలో ప్రాయశ్చిత్తాహుతి నొకటి యిత్తురు. ఆ యాహుతిలో ప్రధాన హోమద్రవ్యమైన ఘృతముతోబాటు చక్కర లేదా బెల్లము లేదా నేతి మిఠాయిని కూడా కలిపి యిత్తురు. ఆ మంత్రము ఈ విధముగా నుండును.

యదస్య కర్మణో ఽత్యరీరిచమ్,
యద్వా న్యూన మిహాకరమ్,
అగ్నిష్ట త్స్విష్టకృ ద్విద్యా త్సర్వం స్విష్టం
సుహుతం కరోతు మే, అగ్నయే స్విష్టకృతే
సుహుత హుతే సర్వ ప్రాయశ్చిత్తా హుతీనాం
కామానామ్ సమర్ధయిత్రే, సర్వాన్నః
కామాన్ సమర్ధయ - స్వాహా.
ఇదమగ్నయే స్విష్టకృతే - ఇదం న మమ

(శతపథ. 14-8-7-5) మరియు ఆపస్తంభ, అశ్వలాయన గృహ్యా సూత్రములు)

ఈ ఋషినిర్మిత మంత్రభావ మేమన -

ఈ యజ్ఞ కర్మయందు ఏది విధికంటె అధికముగ చేయబడినదో లేక తక్కువ చేయబడినదో ఆ ఎక్కువ తక్కువలను ప్రకాశస్వరూపుడైన పరమేశ్వరుడు క్షమించి, వాటిని సరిచేసి ప్రాణులకు శుభము కలుగునట్లు అనుగ్రహించును గాక ! ఈ ప్రాయశ్చిత్తాహుతి అందుకొరకే యిచ్చుచున్నాను. సర్వకామముల నీడేర్చు పరమేశ్వరుడు మా కోర్కెల

నన్నిటిని పూర్ణము చేయును గాక !

ఆ స్విష్టకృత పరమేశ్వరునికే ఈ ఆహుతి నిచ్చుచున్నాను. నా కొరకు కాదు.

మనము తయారు చేసుకొను వంటకములలో ఉప్పు పులుపు కారం మొదలగునవి ఎక్కువ తక్కువలు అయితే వాటిలో కొంత చక్కర చేర్చిన సమరసపడును. తినుటకు అనుకూలమగును. అట్లే మధుర పదార్థ ఆహుతులు మిగిలిన మూలికల తీవ్రతలను సమరస పరచును.

ఈ మిష్టాన్న ఆహుతుల ఆధ్యాత్మిక సందేశ మేమన - మన ఆహార విహార వ్యవహారములు మధురముగా నుండవలెననునదియే. అనివార్యమైనపుడు కొంత కఠినముగా వ్యవహింరించినను అది మన్యువుగా (తల్లి పిల్లవానిని సరిచేయునట్లుగా) నుండవలెనే కాని క్రోధముగా (వైరముగా, ద్వేషముగా) నుండరాదు. వేదముద్వారా పరమేశ్వరుని సందేశ మేమన -

జిహ్వాయా అగ్రే మధు మే జిహ్వామూలే మధూలకమ్ ।
మమేదహ క్రతావసో మమ చిత్తముపాయసి ॥

నా జిహ్వాగ్రమున మరియు జిహ్వామూలమున మధువు నెలకొని యుండునుగాక ! ఓ పరమేశ్వర ! నీవు నా బుద్ధియందును కర్మలయందును చిత్తమునందును వసించి నన్ను కృతార్థుని చేయుము.

మధుమన్మే నిక్రమణం మధుమన్మే పరాయణమ్ ।
వాచా వదామి మధుమద్ భూయాసం మధుసందృశః ॥

నా సమీప దూరదేశముల యందును, ప్రవృత్తి నివృత్తుల యందును మాధుర్యమే నెలకొని యుండునుగాక ! నా వాక్కుతో

మాధుర్యమునే వచింతును గాక. అందువలన నేను మధురూపుడ నగుదును గాక !

మధోరస్మి మధుతరో మదుధాన్మధుమత్తరః ।
మామిత్ కిల త్వం వనాః శాఖాం మధుమతీమివ ॥

(అథర్వవేదము. 1-34-2, 3, 4)

నేను మధురుడను, మధుతరుడను అగుదును గాక !, ప్రపంచమునందలి అత్యధిక మధుర పదార్థముకన్నను ఎక్కువ మధురుడను అగుదును గాక. హే పరమేశ్వర ! మధులత తన శాఖలయందన్నిట మధువును నింపుకొనునట్లు నీవు నాలో నంతట మధువును నింపుము.

ఈ విధముగా ప్రార్థిస్తూ ప్రయత్నిస్తూ మనలో మాధుర్యమును నింపుకోవాలి.

హోమద్రవ్యములలో నాలుగవ వర్గానికి చెందినవి రోగనాశకములు (మూలికలు). ఆయుర్వేదము మరియు వృక్షశాస్త్రరీత్యా రోగనాశకములు చాలా గలవు. వాటిలో అగ్నిహోత్రములో వేయదగినవి కొన్నిమాత్రమే. అందును ముఖ్యమైనవి సోమలత లేదా తిప్పతీగ. ప్రాచీన గ్రంథములలో ఆ యా ఋతువులలో వాడదగిన కొన్ని మూలికలు సూచింపబడినవి. మన భారతదేశములో ఆరు ఋతువులు స్పష్టముగా కనబడును. వీటివలన మన శరీర ఆరోగ్యములోను కొన్ని మార్పులు జరుగుచుండును. ఈ మార్పులు కొందరిలో ఎక్కువగాను, కొందరిలో స్వల్పముగాను కలుగవచ్చును. కాన, ఏ ఋతువులో ఎట్టి మూలికలు అగ్నిహోత్రములో ఆహుతిగా నిచ్చుటవలన ఉపయుక్తముగా నుండునో తెలిసికొని వాటితో హోమము చేయుట మంచిది. ఆ మూలికల వివరణ

తెలిసికొనగోరువారు "ఆర్యపర్వపద్ధతి" అను గ్రంథము చూడగోరెదను. ఈ లఘుగ్రంథమున రోగనాశక హవిస్సులు మనకు ఏ ఆధ్యాత్మిక సందేశము నిచ్చుచున్నవో తెలిసికొందము.

సామాన్యముగా అగ్నిహోత్రములో ఆహుతులుగా నిచ్చు పదార్థము లన్నియు రోగనాశకములు, ఆరోగ్యకరములే. వీటివలన మనకు, మనవారికే కాక ప్రాణులన్నిటికిని మేలు జరుగును. కొన్ని పదార్థములు అగ్నిహోత్రములో ఆక్సీకరణ చెంది రోగములను కలిగించు క్రిములను సంహరించుచున్నట్లుగా కనుగొనబడినది. ఈ హింస హింసగా పరిగణింపబడదు. కిరాతకులను, హంతుకులను చంపుట వలన లోకమునకు మేలు జరుగునట్లే రోగకారక క్రిములను చంపుటవలన లోకమునకు మేలే జరుగును. ఈ రోగనాశక ద్రవ్యములు మనకు ఇట్టి ప్రేరణనే యిచ్చుచున్నవి. ప్రాణులను బాధించు క్రిములను తగిన మూలికలతో సంహరించి వాతావరణమును శుద్ధము చేయుమని ప్రేరేపించుచున్నవి. పరోపకారము చేయుమనియు ప్రబోధించుచున్నవి.

సమాజమును దోచుకుంటూ హింసిస్తూ బాధిస్తూ ఉండే నరరూప రాక్షసులను తగిన విధంగా దండించుటకూడా ఒక యజ్ఞమే. రాజసూయ అశ్వమేధ యజ్ఞములు ఇందుకొరకే రూపొందించబడినవి. రాజులు (పాలకులు) జైత్రయాత్రలు చేసి దుష్టులను దుర్గార్గులను దండించి ప్రజలను రక్షించెడివారు. స్వార్థపరులైన సామంతరాజులు కూడబెట్టిన ధనరాశులను వశపరచుకొని సద్బ్రాహ్మణులకు, సాధుజనులకు, కళాకారులకు, దీనులకు పంచిపెట్టెడివారు. మన ఆదర్శ పురుషుడైన శ్రీకృష్ణుడు గడిపినదియును ఇట్టి యజ్ఞమయ జీతమునే. అందుచేతనే ఆ మహానుభావుడు తన ముక్తి సుఖమునుకూడా త్యాగముచేసి -

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥
(భగవద్గీత. 4-8)

"సాధుజనులను రక్షించుటకు, దుష్కృతులను సంహరించుటకు ధర్మసంస్థాపన చేయుటకు ప్రతియుగమున జన్మింతు"నని నుడివి యున్నాడు. క్షత్రియోచిత యజ్ఞమయ జీవిత మనగా నిట్టిదియే.

అట్లే సద్బ్రాహ్మణుడు లోకమున వ్యాపించియున్న అవిద్యా అజ్ఞానములను నశింపజేసి విద్యా విజ్ఞానములను వ్యాపింపజేయుట బ్రాహ్మణోచిత యజ్ఞమయ జీవిత మగును. మహర్షి దయానందుని జీవితము దీనికి దృష్టాంతము. ఈ విధముగా వారి వారి గుణకర్మ స్వభావములకు అనుగుణముగా యజ్ఞమయ జీవితము గడుపవలెను. ఇయ్యదియే రోగనాశక హోమద్రవ్యములు మన కిచ్చు ఆధ్యాత్మిక సందేశము.

## యజ్ఞవేది (యజ్ఞకుండము)

అగ్నిహోత్రమునకు సమిధలు, ఘృతము, హోమద్రవ్యములు ఎటుల ఆవశ్యకమో అటులనే యజ్ఞవేదియును ఆవశ్యకమే. అగ్నిహోత్రమును ఒక ఆదర్శవంతమైన నాటకముతో పోల్చిన అందు అగ్ని, సమిధలు, ఘృతము, హవిస్సులు నటులుగా (కళాకారులు)గా నెంచవచ్చును. వారు నటించుటకు ఒక వేదిక అవుసరము. ఆ వేదికయే యజ్ఞవేది.

'యం యజ్ఞం వేద్యామన్వ విన్దన్స్ తస్మాద్ వేదిర్నామ'
'యద్ వేద్యాం అన్వవిన్దన్స్ తద్ వేదేర్వేదిత్వమ్ ।'
అని యజ్ఞవేదికి నిర్వచనములు చెప్పుదురు.

వేదిః పదము విద ధాతువుతో నిర్మింపబడును. ధాతుపాఠములో "విద జ్ఞానే, విద సత్తాయామ్, విద విచరణే, విద చేతనాఖ్యాన నివాసేషు, విద్ల్రులాభే" అను ధాతువులు కనబడును. ప్రకరణమును (ప్రసంగమును) బట్టి ఆ యా అర్థములు చెప్పుకొనవచ్చును. వీటిని బట్టి వేదిః అనుపదము లాభము అను అర్థంలోకూడా ప్రయోగింపబడుతుంది.

మానవుడు సహజముగా ప్రతి పనిలోను లాభము నాకాక్షించును. మిగిలిన ప్రయోజనములన్నియు దాని తదుపరియే, వ్యాపారస్తులు తమ దుకాణములలో ఒకవైపు 'శుభమ్' అనియు రెండవవైపు 'లాభమ్' అనియు వ్రాసుకొందురు. వారిదృష్టిలో ఆర్థికమైన లాభమే లాభము. కాని, యాజ్ఞికుల దృష్టిలో లాభ మనగా వేదియే. వేది లేకున్న యజ్ఞమెట్లు జరుగును. అందుచే యాజ్ఞికులు వేదిని యజ్ఞమునకు ఆధారముగా, విష్ణువునకు ఆధారముగా నెంతురు. కాన "విదన్తి జనాః యయా సర్వం (యజ్ఞమ్) సా వేదిః।" "విదన్తి జనాః యస్యాం యజ్ఞం సా వేదిః।" అనియు నిర్వచనము లగును. అనగా స్వయంగా లాభాన్ని కలిగించుట వలనను, యజ్ఞముయొక్క లాభాన్ని కలిగించుట వలనను వేదికి వేది యని పేరుకలిగింది.

దేవతలు యజ్ఞవేదిని ఏవిధంగా పొందగలిగిరో శతపథ బ్రాహ్మణం ఒక కథానిక రూపములో వివరిస్తుంది. ఆ మనోహర కథానిక ఈ విధంగా సాగింది.

ప్రజాపతికి యిద్దరు కుమార్తెలు. దితి మరియు అదితులు. దితికి దైత్యులు (అసురులు), అదితికి ఆదిత్యులు (దేవతలు) జన్మించిరి. అసురులు, దేవతలు అక్కాచెల్లెండ్ర సంతానమే కనుక వారు అన్నదమ్ములే. అయినను వీరు పరస్పరము కలహించుకుంటూనే ఉండేవారు. ఒక

పర్యాయము అసురులు దేవతలను నిర్లక్ష్యముచేసి ఈ భూమండలము నంతటిని తామే పంచుకొని అనుభవించవలెనని కుట్రపన్నిరి. ఇది చూసి దేవతలు నిరాశా నిస్పృహలతో ఏమిచేయవలెనని ఆలోచించు చుండిరి.

అసురులు ఒక ఎద్దు చర్మమును కొలబద్దగా చేసుకొని తూర్పు పడమరులుగా ఈ భూమిని కొలుచుకుంటూ తమలోతాము భాగములు చేసుకొనుచుండిరి. ఈ విధంగా ఈ భూమి అంతా వారే పంచుకుంటే మన గతి ఏమి కావలెనని దేవతలు తీవ్రంగా ఆలోచించిరి. మనము కూడా వెళ్ళి మా భూభాగము చూపుమని కోరవలెనని నిర్ణయించుకొనిరి. ప్రయత్నిస్తే కొంతయైనా దక్కుతుంది. లేకుంటే మనం నిలుచుటకు కూడా నీడ దొరకదని భావించిరి. దేవతలు తెలివైనవారు కదా ! అందుచే విష్ణువును (యజ్ఞమును) వెంటబెట్టుకొని అసురులు పంచుకొను చోటుకు వెళ్ళిరి. తమకును కొంత భూభాగము నిమ్మని విన్నవించుకొనిరి. అంత అసురులు ఆలోచించుకొని కొంతయైనా యిచ్చుట మంచిదని ఎంచి సరే మీ విష్ణుదేవుడు పరుండునంతటి స్థలము మీకు వదిలిపెట్టుచున్నామని వెటకారంగా పలికిరి. విష్ణువు వామనుడు (పొట్టివాడు) కదా ! ఎంత స్థలము నాక్రమించునులే యని అసురు లనుకొనిరి.

అసురుల మాటలు వినగానే దేవతలు లోలోపల సంతసించిరి. మాకు మా విష్ణుదేవుని పూజించుకొనుటకు సరిపడునంత స్థలము ఇచ్చిన అదియే పదివేలు అనిరి. ఇచ్చట విష్ణుదేవు డనగా యజ్ఞమే. యజ్ఞమునకు గల నామములలో "విష్ణుః" అనునది యొకటి. విష్ణుపదమునకు మౌళిక అర్థం 'వ్యాపించేది' అని. యజ్ఞమునుండి వెలువడు వాయువు భూలోక భువర్లోక స్వర్లోకముల మూడిటిలోను వ్యాపించగలదు. అదియే జరిగినది. అసురులిచ్చిన ఆ కొద్ది స్థలంలో దేవతలు యజ్ఞకుండమును నిర్మించి

ఛందస్సులతో (వేదమంత్రములతో) ఆహుతు లిచ్చుట ప్రారంభించిరి. ఆ విధంగా విడువకుండా పరిశ్రమచేస్తూ, అర్చనచేస్తూ పృథివినంతా ఆక్రమించిరి. యజ్ఞభూమిని విస్తరిస్తూ విస్తరిస్తూ పూర్తిగా భూమినంతా లాభముగా సంపాదించిరి. ఈ కారణము చేతనే -

**ఏతావతీ వై పృథివీ । తావతీ వేదిః ॥**

**(తై. ఆ. 3-2-9-12)**

**యావతీ వై వేది స్తావతీ పృథివీ ॥**

**(శత. బ్రా. 3-7-2-1)**

పృథివి ఎంత ఉన్నదో వేది అంత ఉన్నది. వేది ఎంత ఉన్నదో పృథివి అంత ఉన్నది - అని చెప్పబడినది. యజ్ఞకుండము విష్ణువు యొక్క వామనరూపము. యజ్ఞము విష్ణువు యొక్క విస్తృతరూపము.

దేనివలన పృథివి నంతటిని లాభముగా పొందగలమో అదియే వేది. అసురులు స్వార్థపరులు. వారు పృథివి నంతటినీ తామే అనుభవింపవలెనని పంచుకొనసాగిరి. దేవత లట్లుకాక యజ్ఞముకొరకు అనగా లోకహితముకొరకు భూమిని కోరిరి. అందుకొరకే భూమిని ఆక్రమించుకొనిరి. విష్ణువు (వేది) వామనుడు కదా ! ఎంత స్థలము ఆక్రమించునులే అని అసురు లనుకొనిరి. వేదికి స్థాన మిచ్చిరి. ఆ వేదితో (యజ్ఞముతో) భూమినంతటిని లాభాముగా పొందగలిగిరి దేవతలు. స్వార్థము ఓడిపోయినది. త్యాగము గెలిచినది. వేది (యజ్ఞము) కేవలము భూలోకమునే కాదు. భువర్లోక స్వర్లోకములను కూడా ఆక్రమించిగలదు.

వామన విష్ణు రూపములు కేవలము యజ్ఞమునందేకాక ప్రతి వస్తువునందును కనబడును.

1. అధియజ్ఞములో అగ్ని వామనుడు - సూర్యుడు విష్ణువు.
2. అధ్యాత్మయజ్ఞములో సంకల్పము వామనుడు - సత్యము విష్ణువు.
3. అధిభూతములో పరమాణువు వామనుడు - బ్రహ్మాండము విష్ణువు.
4. అధిప్రజాలో వీర్యకణము వామనుడు - బాలకుడు విష్ణువు.
5. అధివిద్యాలో బ్రహ్మచారి వామనుడు - స్నాతకుడు విష్ణువు.
6. అధివానస్పత్యములో బీజము వామనుడు - వృక్షము విష్ణువు.
7. అధిసంఖ్యాలో సున్న వామనుడు - తొమ్మిది విష్ణువు.
8. అధిఆశ్రమములో బ్రహ్మచారి వామనుడు - సంన్యాసి విష్ణువు.
9. అధివర్ణములో శూద్రుడు వామనుడు - బ్రాహ్మణుడు విష్ణువు.
10. అధిశబ్దములో ప్రణవము వామనుడు - వేదము విష్ణువు.

ఇట్లే సృష్టిలో అంతట ఈ రెండు రూపములు కనబడును. ఎచ్చటెచ్చట వామన విష్ణు రూపము లుండునో అచ్చటచ్చట వేదియును ఉండును. ఎచ్చట వామనుడు వసింప స్థానము దొరకునో అది వేదియే యగును. అధియజ్ఞములో అగ్నినామక వామనునకు భూమిపై ఎచ్చట స్థానము లభించునో అది వేది యగును. అట్లే సంకల్ప మను వామనునకు హృదయము, పరమాణు వను వామనునకు దానికి లభించిన ఆకాశము (స్థానము), వీర్యాణు వను వామనుకు స్త్రీ అండము (గర్భాశయము) వేదు లగునని గ్రహించవలెను.

అగ్నినామక వామనుని స్థాపించు కుండమును అందుకు అనుగుణముగానే యున్నది. అందు స్థాపించు అగ్నివామనుడు క్రమముగా వికసించి ఆదిత్యరూప విష్ణు వగును. అపార మేధాసంపన్నుడు, వేద వేదాంగ వేత్త, ఈ యుగమున ఉద్భవించిన కల్పసూత్రకారుడునైన మహర్షి దయానందుడు ఆవిష్కరించిన యజ్ఞకుండము పూర్తిగా వైజ్ఞానికమైనది.

ఆ కుండము పై వెడల్పు 16 అం. చతురస్రము, క్రింది వెడల్పు 4 అం. చతురస్రము, లోతు 16 అం. కలిగినదిగా నుండును. కుండమును బోర్లించిన అది పిరమిడ్ ఆకారమును బోలియుండును. ఇటువంటి ఆకారముతో వివిధ పరిమాణములలో పై కొలతలకన్న చిన్నవిగాను పెద్దవిగాను నిర్మించుకొనవచ్చును. కాని, క్రింద చతుర్థాంశముగాను అనగా పై కొలతలో నాలుగవ భాగముగాను, పై భాగము చతుర్గుణకముగాను అనగా క్రింది భాగముకన్న నాలుగురెట్లు అధికము గాను ఉండవలయును. మనము ఇచ్చు ఆహుతుల సంఖ్యను బట్టి పెద్దవిగాను, చిన్నవిగాను నిర్మించుకోవచ్చును. షోడశ సంస్కారముల వరకు 16 అం॥ చతురస్రము సరిపోవును.

పై ఆకారములో నిర్మించిన అగ్నికుండమువలన అందు జనించు హోమవాయువులు నాలుగు వైపులకు సమానముగా విస్తరిస్తూ (వ్యాపిస్తూ) ద్యులోకమునగల సూర్యుని వరకు చేరును. అప్పుడు అగ్నివామనుడు విష్ణు వగును. అగ్నిహోత్రమువలె మన జీవిత మను బీజము ఉద్భిదమై వృక్షము కావలెనని వేదము చెప్పును.

**ఆనోః భద్రా కృతవో యన్తు ఉద్భిదః (ఋగ్వేదము. 1-89-1)**

బ్రహ్మచర్యాశ్రమముతో ప్రారంభించి క్రమంగా గృహస్థ వానప్రస్థములను పూర్తిచేసి నాలుగురెట్లు పెరిగి సంన్యాసాశ్రమమును పొందవలెనని అగ్నికుండ నిర్మాణము సూచించును.

హృదయమున స్థాపించుకున్న శ్రద్ధారూప వామనాగ్ని సత్యజ్ఞాన రూప ఆజ్యముతో క్రమంగా వికసిస్తూ తద్విష్ణో పరమం పదం - ఆ విష్ణువు యొక్క పరమ పదమును దర్శింపజేయును.

వేది యనగా కేవలము అగ్నికుండమే కాదు. దానికి నాలుగువైపుల 3 మెట్లు ఉండవలెను. వీటికి శాస్త్రీయ పరిభాషలో మేఖలలు అని పేరు. మీయతే ప్రక్షిప్యతే కాయమధ్యభాగే అని నిర్వచనము చెప్పుదురు. అనగా మనిషి ఏదైనా బరువైన పని ప్రారంభించునపుడు తుండుగుడ్డతో నడుము బిగించి పనిచేయ ప్రారంభించును. అట్లే అగ్నికుండమును సీమాబద్ధము చేసి అనగా మేఖలలు నిర్మించి అగ్నిహోత్రము నారంభింతురు. కుండము అనగా రక్షించేది, దహించేది అని అర్థం. కుడి – రక్షణే, కుడి – దాహే' అను రెండు ధాతువులతోను కుండము అను పదము నిర్మించవచ్చును. అట్టి అగ్నికుండమును అగ్నిహోత్రవేడికి పగిలిపోకుండా ఈ మేఖలలు కాపాడును. పెద్ద యజ్ఞకుండమునకయితే, 5 అం. ఎత్తు, 5 అం. వెడల్పు కలిగిన 3 మెట్లు (మేఖలలు) ఉండవలెను. అనగా యజ్ఞశాల భూమట్టమునుండి 15 అం. ఎత్తు ఉండవలెను. ఈ మూడు మెట్లును మనకు మరికొన్ని ఆధ్యాత్మిక సందేశముల నిచ్చును.

యజ్ఞవేదికి గల మూడు మెట్లు బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమములకు సూచకములు(ప్రతీకలు). ఈ మూటిని అధిరోహించి సంన్యాసివి కమ్మని యివి మనను ప్రేరేపించుచున్నవి. యజ్ఞాగ్నియే సంన్యాసాశ్రమము. అందుచేతనే సంన్యాసి అగ్ని రంగుగల కాషాయ వస్త్రములను ధరించవలె నను నియమము కలదు. అతడు దేశసంచారము చేయు అగ్నిహోత్రము. అతను నిర్వహించునది విశ్వశోధార యజ్ఞము. ప్రాణిమాత్రులందరి సంక్షేమం, ఉన్నతి కోరు ఆదిత్యుడు. నేను, నాది అను సంకుచిత భావములను విడచి వసుధైవ కుటుంభకముగా జీవించు ఆదర్శపురుషుడు.

మానవ జీవిత లక్ష్యం త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తి. పరమానంద ప్రాప్తి. అదియే మోక్షము. దానిని అందుకొనుటకే నాలుగు ఆశ్రమాలు రూపొందించబడ్డాయి. 3 మెట్లు ఎక్కి నాలుగవ ఆశ్రమమైన సంన్యాసాశ్రమాన్ని చేరుకోగలగాలి. సంన్యాసధామము మానవజీవన అంతిమ మెట్టు అని మహర్షి వేదవ్యాసులవారు మహాభారతమున తెలిపియున్నారు.

చతుష్పదీ హి నిఃశ్రేణీ బ్రహ్మణ్యేషా ప్రతిష్ఠితా ।
యం హి నిఃశ్రేణీమారుహ్య బ్రహ్మలోకే మహీయతే ॥
(మహాభారత శాంతిపర్వం. 20-4)

పై శ్లోకములోని బ్రహ్మలోకే అను పదమునకు సంన్యాసాశ్రమము అని అర్థం. వేదాలలో ఎచ్చటను సంన్యాస పదము గాని, ఆశ్రమ పదముగాని లేదని కొందరు వేదవిద్వాంసులు చెప్పుదురు. ఏదేని ఒక స్థితిని ప్రాప్తించినపడు లోక శబ్దం ప్రయోగింపబడటం శాస్త్రాలలో కనబడుతుంది. ఎవరైనా వ్యక్తి ఐశ్వర్యవంతుడయితే అతడు ఇంద్రలోక వాసి అయ్యెననియు, కన్య వివాహానంతరం పితృగృహమును విడచి పతిగృహమున చేరితే 'పితృలోకాత్ పతిలోకం గమేయమ్' అనియు ప్రయోగములు కనబడును. అట్లే సంన్యాసాశ్రామమునకు చేరుకొన్నచో బ్రహ్మలోకే మహీయతే అనియు చెప్పుట జరిగినది.

ఈ వైదిక పరిభాష ననసరించి సంన్యాసి ఆనందలోకవాసి - స ఏవాయం ఆనందం లబ్ధ్వా ఆనన్దీ భవతి. బహుశః ఈ దృష్టితోనే సంన్యాసిపేరు చివర 'ఆనంద' పదము జోడింపబడుట ప్రచలితమై యున్నది. సంన్యాసి ముఖ్యంగా మోహ - మాయాదులను పూర్తిగా త్యజించవలసి యుండును. సమ్యఙ్ న్యస్యన్త్యధర్మాచరణాని యేన స

సంన్యాసః యః తద్వాన్ స సంన్యాసీ – సంన్యాసి పదములో సమ్యక్ న్యాసము చక్కగా విడిచిపెట్టుట అను భావము నిహితమై యున్నది. సంసార సుఖ దుఃఖములను పూర్తిగా విడచిపెట్టి, మరి పొందవలసినది ఏది? అదియే ఆనందము. అతీంద్రియ అవిచ్ఛిన్న అత్యంతిక సుఖము. అందుకొరకే వేది. వేది మనకు కలిగించు మహోన్నత లాభ మియ్యదియే.

పృథివ్యా అహ ముదన్తరిక్షమారుహమ్ ।
అన్తరిక్షాద్ దివమారుహమ్ ।
దివో నాకస్య పృష్ఠాత్ స్వర్జ్యోతిరగామహమ్ ॥

(యజుర్వేదము. 17-67)

నేను బ్రహ్మచర్యాశ్రమమున ప్రవేశించి పృథివీలోకమున పాదార్పాణ చేయుదును గాక. గృహస్థాశ్రమమున ప్రవేశించి అంతరిక్ష లోకమున పాదార్పణ చేయుదును గాక. వానప్రస్థాశ్రమమున ప్రవేశించి ద్యులోకమున పాదార్పణ చేయుదును గాక. చివరగా సంన్యాసాశ్రమమున ప్రవేశించి స్వర్లోకమున పరమేశ్వరుని ఆనందమయ తృతీయధామమున పాదార్పాణ చేయుదును గాక.

అని ప్రతి వ్యక్తి సంకల్పం చేయాలి. అందుకొరకై పూర్ణ పురుషార్థం చేయాలి. స్వలోకమునుండి స్వర్లోకానికి చేరాలి.

## పంచాగ్ని కుండములు

దర్శపూర్ణమాసాది విశేష యాగములలో పంచాగ్ని కుండముల వర్ణన కనబడును. అవి 1. ఆహవనీయాగ్నికుండము, 2. గార్హపత్యాగ్ని కుండము, 3. దక్షిణాగ్నికుండము, 4. అవస్థ్యాగ్ని కుండము, 5. సమ్యాగ్ని కుండము. వీటిలో ఆహవనీయ అవస్థ్య సమ్యాగ్ని కుండములు మూడును చతురస్ర ఆకారముగానే యుండును కాని లోతులో భేదము లుండును.

గార్హపత్యాగ్నికుండము గుండ్రముగాను, దక్షిణాగ్ని కుండము అర్ధచంద్రాకృతిగాను ఉండును. ఇవేకాక మరెన్నో రకముల ఆకారముల కుండముల వర్ణన శాస్త్రములందు కనబడును. కుండములు ఏ ఆకారములో ఉంటే అదే ఆకారములో మేఖలలు ఉండును.

మహర్షి దయానంద సరస్వతి గారు తమ ఋగ్వేదాది భాష్యభూమిక యను గ్రంథములో గణిత విద్యా విషయమున ఒక మంత్రమునకు వ్యాఖ్యానము చేయుచు "త్రికోణ, చౌకోణ, శయనపక్షి ఆకారములతోను మరియు గోళాకారము మొదలగు ఆకారములతోను యజ్ఞవేదులు నిర్మించవచ్చు" నని వ్రాసిరి.

ఒక పర్యాయము మహర్షి రాజస్థాన్ నందలి శహపూర సంస్థానమునకు వెళ్ళుట జరిగినది. అప్పుడు ఆ రాజ్యమును శ్రీమాన్ హరసింహజీ పాలించుచుండిరి. మహర్షి అక్కడ కొంతకాలము ఉండి వైదికధర్మ ప్రచారము చేసిరి. ఆ రాజుయొక్క పురోహితులైన శ్రీ పుండరీక్‌జీ గృహమున పంచాగ్నికుండము లుండుట చూచిరి. ఒక సందర్భమున రాజుతో " ఓ మహారాజా ! మీ ప్రాచీన రాజమహల్ నందు పంచాగ్ని కుండములను నిర్మించి విధి పూర్వకముగా అగ్నిహోత్రములు నిర్వహించుచుండవలె" నని ఉపదేశించిరి. శ్రీ పుండరీక్‌జీ యింట నున్నటువంటి వాటి మాదిరిగా నిర్మించమని సూచించిరి. శ్రీ మహారాజు ఆ విధముగానే తన ప్రాచీన రాజప్రాసాదమునందు యజ్ఞశాలను నిర్మించి పంచాగ్నికుండములను నిర్మింపజేసిరి. అవి యిప్పటికిని ఆ రాజప్రాసాదమున నున్నవి.

ఇక అగ్ని మనకు ఏ ఆధ్యాత్మిక సందేశము నిచ్చుచున్నదో ఆలోచింతము.

# అగ్ని

సామాన్యంగా మనం అగ్ని పదము వినగానే మన మనసులో భౌతికాగ్ని ప్రత్యక్ష మగును. ప్రకాశము, తాపము (వేడి) అను రెండు గుణములు గల భౌతికాగ్ని మనకు ఎన్నో విధాల ఉపయోగపడును. ఇందులో యిసుమంతయు సందేహము లేదు. అందుచేతనే జనసామాన్యంలో అగ్ని పదము భౌతికాగ్నికే రూఢిగా పరిమితమై పోయింది. వేద శాస్త్రాలలో అగ్ని పదమునకు విశాలమైన అర్థం ఉంది. మహర్షి యాస్కుడు తన నిరుక్త శాస్త్రంలో అగ్నిః కస్మాత్ ? అని తనను తానే ప్రశ్నించుకొని, అగ్రణీర్భవతీతి అని నిర్వచించెను. అనగా తాను అగ్రగామిగా ఉంటూ మనను లక్ష్యమువైపు నడిపించేది అని అర్థం. కనుక అగ్ని పదము కేవలం భౌతికాగ్నికే కాక మనకు మార్గదర్శనం చేస్తూ మనను లక్ష్యమువైపు నడిపిస్తూ లక్ష్యాన్ని చేర్చగలవారందరికి యిది వర్తిస్తుంది.

బ్రహ్మచారులకు గురువులు, గృహస్థులకు అతిథులు (సంన్యాసులు), వానప్రస్థులకు (యోగులకు) అంతర్యామియైన పరమేశ్వరుడు, సామాన్య ప్రజలకు నాయకులు మార్గదర్శనం చేస్తూ నడిపిస్తారు. కనుక వీరందరిని అగ్నులు అనవచ్చును.

అగ్నిలో ప్రకాశము, తాపము, సమర్పణము అను 3 గుణములు ఉండును. సమర్పణము అనగా తనను తాను అర్పించుకొనుట. అగ్ని తనలోని తాప ప్రకాశములను చివరి వరకు (తన కొన ఊపిరివరకు) ఇతరులకు అర్పిస్తూనే ఉంటుంది. అట్లే మానవులు తమలోని జ్ఞానరూప ప్రకాశాన్ని, శక్తిరూప తాపాన్ని తోటివారి ఉన్నతికొరకు త్యాగము (సమర్పణము) చేయగలిగితే వారుకూడా అగ్నులు అవుతారు. ముఖ్యంగా

వారు ఆదర్శ జీవనం గడుపుచూ, ఇతరులకు మార్గదర్శకంగా ఉంటూ వారిని లక్ష్యమువైపు నడిపించేవారుగా ఉండాలి. అగ్నినుండి మనము నేర్చుకోవలసిన ముఖ్య సందేశ మిదియే.

ఈ విషయము మరింత స్పష్టపరచుటకు శతపథ బ్రాహ్మణము ఒక కథానికను కల్పించినది. ఆ కథ ఏమన -

పూర్వము దేవతలు మరియు అసురులు అని రెండు వర్గములు ఉండెడివి. ఇరు వర్గములు తరచు కలహించుకొనెడివారు. దేవాసుర సంగ్రామములు జరుగు చుండెడివి. వీరంతా మరణధర్మము కలవారే. అనగా వీరు ఆత్మజ్ఞానము (ఆత్మ అమరము అను జ్ఞానము) లేనివారే. వీరిలో అగ్ని ఒక్కటే అమృతము. దాని ఆశ్రయముతోనే అమృతత్వమును భోగించెడివారు. ఒకానొక సమయమున దేవతల సంఖ్య బాగా తగ్గిపోయినది. ఏ విధముగా మనము అసురులను ఓడించగలమని దేవతలు ఆలోచించసాగిరి. వారికి ఒక చక్కటి ఆలోచన వచ్చినది. అమృతరూపమైన అగ్నిని మన ఆత్మలో ధరించి అర్చన మరియు శ్రమ చేస్తూ (ప్రార్థన మరియు పూర్ణ పురుషార్థములు చేస్తూ) అసురులను ఓడించగలమని తలచిరి. ఇంతలోనే వారిలో మరొకరికి ఒక సంశయము వచ్చినది. ఈ అగ్ని మనలోను మరియు అసురులలోను సమానముగానే ఉన్నది కదా ! ఒకవేళ అసురులుకూడా మనవలెనే అగ్నిని ఆత్మలో ఆధానము చేసుకొన్నచో ఎవరిని ఎవరు ఓడించగలము? అను సంశయము వచ్చినది. ఈ విషయం వారిని అడిగి తెలిసికొనుటయే మంచిదని వారి వద్దకు వెళ్ళిరి.

ఓ అసురులారా ! మీరు అగ్నిని ఏమి చేయుచున్నారు?' అని అడిగిరి. అందుకు అసురులు వెటకారంగా 'ఓ పిచ్చివారలార ! అగ్నిని

ఎలా వాడుకోవాలో తెలియదా ? మేము అగ్నితో చక్కగా వంట చేసుకుంటున్నాము. నీళ్ళు కాచుకుంటున్నాము. చలి కాచుకుంటున్నాము. మాంసము, దుంపలు కాల్చుకుని తింటున్నాము. ఇనుమును అగ్నిలో కాల్చి కత్తులు కటారులు తయారు చేసుకుంటున్నాము. మాకు ఎలా కావాలంటే అలా వాడుకుంటున్నాము. మీరు కూడా ఆ విధంగా ఉపయోగించుకోండి. అంతమాత్రము తెలియదా!" అనిరి. అంత దేవతలకు 'వీరు అగ్నిని ఆత్మలో ధరించలేదు. కేవలం భౌతిక ప్రయోజనముల కొరకే ఉపయోగించుకుంటున్నారని అర్థమయ్యింది. లోలోపల సంతసించిరి. వెంటనే దేవతలు తిరిగి వారి స్వస్థానమునకు వెళ్ళి అగ్నిని ఆత్మలో ధరించి అమరులైరి. వారి ప్రతిద్వందులను ఓడించ గలిగిరి.

పై కథానిక వెనుక ఒక ఆధ్యాత్మిక సందేశము దాగియున్నది. అగ్నిని అసురులు తమ స్వార్థము కొరకే వాడుకొనిరి. అంతరాత్మలో ఆహితము చేయలేదు. అందుచే అమరులు కాలేకపోయిరి. దేవతల చేతిలో ఓడిపోయిరి. అమరులగుటకు అగ్నిని ఆత్మలో ధరించుటయే ఏకైక మార్గము. అగ్నిలోని ప్రకాశ తాప సమర్పణము లను గుణములను ఆత్మలో ధరించాలి. దీనినే వ్రతాగ్ని లేదా శ్రద్ధా, దీక్ష , సంకల్ప వ్రతము లందురు.

మన శరీరమునందును ఎన్నో అగ్నులు పనిచేయుచున్నవి. అగ్నులు ఉండబట్టే ఈ శరీరమును శరీరమనుచున్నారని గర్భోపనిషత్ చెప్పును. "అగ్నయో హ్యత్ర శ్రియన్తే తత్ శరీరమ్" ఆహారమును పచనము చేయునది జఠరాగ్ని. దర్శనశక్తిని యిచ్చునది దర్శనాగ్ని. మంచి చెడులను వివేచించునది జ్ఞానాగ్ని. ఇట్లే ముందు చెప్పుకున్న పంచాగ్నులలోని

3 అగ్నులు మన శరీరములోనే నెలకొని యున్నవని ఉపనిషత్ చెప్పును. "ముఖే ఆహవనీయం, ఉదరే గార్హపత్యో హృది దక్షిణాగ్నిః".

ముఖమునందు అనగా నోటియందు ఆహవనీయాగ్ని యుండును. ఇది భోజనమునందలి రసమును (రుచిని) గ్రహించుటయేగాక లాలాజలమును స్రవింపజేసి జీర్ణక్రియకు తోడ్పడును. మెత్తగా నమిలి జీర్ణకోశమున కందించును. ముఖాగ్ని హవ్యవాహనుదు. దేవదూత. మిగిలిన ఇంద్రియదేవతల కన్నిటికి ఆహార సారము నందించును. ఋగ్వేద ప్రథమ సూక్తము దీనిని 'కవిః' అని కీర్తించును.

గార్హపత్యాగ్ని యొక్క నివాస స్థానము ఉదరము. దీనిని జఠరాగ్ని యనికూడా అందురు. ఇది 'కవిర్ గృహతిర్' అనవచ్చును. మనము తీసుకొను రకరకముల ఆహార పదార్థములు ఎచటకు చేరునో అది గార్హపత్యాగారము. ఆ వేదియందున్న అగ్ని గార్హపత్యాగ్ని. మిగిలిన యింద్రియము లన్నియు ప్రయత్నించి సంపాదించిన ఆహారమును నోటిద్వారా గార్హపత్యాగ్నియందు ఆహుతులుగా నిచ్చును. ఆ జఠరాగ్ని దేవత. వాటిని పచనము చేసి మరల యింద్రియములకు, శరీరమునకు అందజేయును.

దక్షిణాగ్ని యొక్క నివాసస్థానము హృదయము. ఆహవనీయ గార్హపత్యాగ్నులను సమృద్ధపరచగల శక్తి దీనికే యున్నది. దీనిని వ్రతాగ్ని లేదా దీక్షాగ్ని యని కూడా అనవచ్చును. ఏలనన ఈ రెండే సమృద్ధికి (దక్షిణకు) ముందు ఉండును.

"వ్రతేన దీక్షా మాప్నోతి, దీక్ష యాప్నోతి దక్షిణామ్"

వ్రత దీక్షా దక్షిణలకు హృదయమే స్థానము. అందుచేతనే వ్రతము కొరకు హృదయమును స్పృశింతురు. "మమ వ్రతే తే హృదయం

దధామి..." అను మంత్రమును పఠింతురు.

వధూవరులు, గురుశిష్యులు ఈ విధముగా వ్రతధారణ చేయుదరు.

## ప్రయుజ్, మనస్, తపస్, పూషన్ అగ్నులు

మనశరీరములో ముందు తెలుసుకున్న మూడు అగ్నులే కాక శీర్షికలో చూపిన మరొక నాలుగు అగ్నులు కూడా యుండునని వేదము చెప్పును.

ఆకూత్యై ప్రయుజే అగ్నయే స్వాహా
మేధాయై మనసే అగ్నయే స్వాహా
దీక్షాయై తపసే అగ్నయే స్వాహా
సరస్వత్యై పూష్ణే అగ్నయే స్వాహా (యజుర్వేదము. 4-7)

మనము ఒక్కొక్క పర్యాయము జ్ఞాన అనుమానాల ఆధారంగా అత్యంత ఉత్సాహవంతులమై ఈ పని చేసి తీరాలి, ఎట్టైనా దీనిని సాధించాలి అనే ఉత్సాహాన్ని పొందుతూ ఉంటాము. దీనినే ప్రయుజాగ్ని యందురు. ఎక్కడనుండి జ్ఞానపూర్ణములైన ఆలోచనలు ఉద్భవించుచున్నవో దానిని మేధ యందురు. దేని బలముతో ఈ మానసిక విచారములు మేధయందు కలుగుచున్నవో దానిని మనసాగ్ని యందురు. ఆకూతి యొక్క జన్మ మేధ యందును, మేధయొక్క జన్మ దీక్ష యందును కలుగుచున్నవి. ఈ దీక్షకు (దృఢ నిశ్చయమునకు) తపసాగ్నివలన బలము చేకూరుచున్నది. ఇవేకాక, మనలో ద్వంద్వ సహనశక్తి అంతర్బలము (ఆత్మబలము) వలన కలుగుచున్నది. ఈ అంతర్బలమునకే సరస్వతి యని పేరు. ఆ సరస్వతీ ప్రవాహము (అంతర్బల ప్రవాహము) పూషన్ అగ్ని లేనిదే కలగదు.

ఆకూతికొరకు మేధ అవసరము. మేధకొరకు దీక్ష, దీక్ష కొరకు

సరస్వతి అవసరము. వీటిని ప్రదీప్తము చేయుటకు క్రమముగా ప్రయుజ్, మనస్, తపస్ మరియు పూషన్ అగ్నుల ఆవశ్యకత యున్నది. పరమపిత పరమేశ్వరుడు మానవులమైన మనకొరకు ఈ నాలుగు అగ్నులను మన శరీరములో స్థాపించినాడు. అందుచేతనే మానవుడు జ్ఞాన విజ్ఞానాలతో, కళాకౌశలాలతో, ధైర్యసాహసాలతో, ప్రతిభాపాటవాలతో వెలుగొందుచున్నాడు.

మానవుడు వీటి ఆవశ్యకతను గుర్తించి అగ్నిహోత్రములో పై వేద వాక్యాలతో ఆహుతుల నిస్తూ, ప్రేరణ పొందుతూ వాటిని తనలో పెంచుకొన ప్రయత్నించాలి.

## అధి విద్యా యజ్ఞము

భారతీయ సంస్కృతిలొ విద్యాభ్యాసం ఒక యజ్ఞం. పూర్వ కాలంలో బాల బాలికలకు అయిదవ సంవత్సరంలో అక్షరాభ్యాసం చేయించి వ్రాయటం చదవటం నేర్పేవారు. ముఖ్యమైన కొన్ని వేదమంత్రాలు, నీతి శ్లోకాలు, పద్యాలు, పాటలు కంఠస్థం చేయించేవారు. వారి పనులు వారే చేసుకోవడం నేర్పేవారు. 8వ సంవత్సరంలో ఉపనయన వేదారంభ సంస్కారాలు చేసి మగపిల్లలను బ్రహ్మచారుల గురుకులానికి, ఆడపిల్లలను కన్యాగురుకులానికి పంపేవారు. గురుకులాలు ఊరికి దూరంగా ఉపవనాలలో ఉండేవి. బ్రహ్మచారుల గురుకులానికి కన్యాగురుకులానికి చాలా దూరం ఉండేటట్టు గురుకులాలు నిర్మించేవారు. సంతృప్తికరంగా వారి విద్యాభ్యాసం పూర్తయ్యేవరకు ఆ గురుకులాలలోనే విద్యా యజ్ఞ దీక్షితులై ఉండేవారు.

అట్టి కాలంలో రాష్ట్ర సంపదవంటి బ్రహ్మచారినీ బ్రహ్మచారులు సమిధను చేతబట్టుకొని ఆచార్యుని వద్దకు వెళ్ళేవారు. అంత ఆచార్యుడు

కస్య బ్రహ్మచారీ అసి ? నీవు ఎవరి బ్రహ్మచారివి (విద్యార్థివి) ? అని అడిగేవారు. దానికి సమాధానముగా ఆ బ్రహ్మచారి సరళముగా 'బవతః (మీ యొక్క బ్రహ్మచారిని)' అని చెప్పేవాడు. ఈవిషయం ఆచార్యునకు తెలియును. అయినప్పటికి ముఖ్యంగా ఒక విషయం వారికి బోధించాలని ఆ విధంగా అడిగేవారు. నాయనా నీవు ముందుగా 'ఇంద్రస్య బ్రహ్మచారీ అసి' పరమైశ్వర్యవంతుడైన పరమేశ్వరుని బ్రహ్మచారివి. తదుపరి 'అగ్ని రాచార్యః తవ' అగ్నిహోత్రము నీకు ఆచార్యుడు. అతని నుండి నీవు యజ్ఞమయ జీవితాన్ని నేర్చుకోవలసి ఉంది. అనంతరమే 'అహమ్ ఆచార్యః తవ' నేను నీకు ఆచార్యుడను - అని ఉపదేశించేవారు.

ఆధ్యాత్మికంగా మానవమాత్రులందరికి మొదటి గురువు అంతర్యామియైయున్న పరమేశ్వరుడు. అతడు 'పూర్వేషామపి గురుః కాలేనా నవచ్ఛేదాత్' (యోగ దర్శనం. 1-26) పూర్వ పూర్వ యుగాలలోని వారికిని అతడు గురువే. తదుపరి అగ్నిహోత్రమును ఆచరిస్తూ తనలో శ్రద్ధారూప అగ్నిని స్థాపించుకోవలసి ఉంటుంది. ఆ శ్రద్ధారూప అగ్నిలోనే ఈ లోకమందలి గురువులు సత్యవిద్యలను ఆహుతులుగా నివ్వగలరు. అప్పుడే ఆ బ్రహ్మచారి విద్యతో ప్రదీప్తుడై బ్రహ్మతేజస్సుతో వెలుగొంద గలడు. మరెందరినో విద్యావంతుల చేయగలడు.

పై క్రియకన్న పూర్వమే ఆచార్యుడు బ్రహ్మచారిచే సూర్యోవ లోకనము చేయించును .

**దేవ సవితుర్ ఏష తే బ్రహ్మచారీ తం గోపాయ స మా మృత**

"ఓ సవితా దేవా ! ఈ బ్రహ్మచారి నీ వాడు. ఇతనిని రక్షింపుము. మృత్యువును దూరము చేయుము' అని ప్రార్థించును.

'తత్ చక్షు ర్దేవహితం....అను మంత్రమును పఠించుచు శత

వర్షముల ఆయువును, ఇంద్రియ పటుత్వమును కలిగియుండు విధముగా జీవించవలెనని ఉపదేశించును.

ఈ క్రియలోని అంతరార్థమేమన – గురుకులం ఒక చిన్న సౌర మండలం వంటిది. ఆదిత్యుని చుట్టూ గ్రహములు వాటి వాటి పరిధులలో తిరుగుచున్నట్లు ఆచార్యుని చుట్టూ శిష్యులు పరిక్రమించుచుందురు. జ్ఞాన సదాచారములను గ్రహించుచుందరు. ఆచార్యుడు కొంతకాలము కొన్ని విషయములందు మార్గదర్శకుడు కాగలడు. జీవితకాలమంతయు అన్ని వేళల ప్రేరణ కలిగించువాడు అంతర్యామియైన పరమేశ్వరుడు మాత్రమే.

ఆ తదుపరి ఆకాశమున నియమముగా నుదయించు సూర్యుడు నీకు రెండవ ఆచార్యుడు. ఈ లోకమునందలి ఆచార్యుడు ఏ కారణము చేతనైన పథభ్రష్టుడు కావచ్చునేమో కాని పరమేశ్వర విభూతియైన సూర్యుడు పథభ్రష్టుడు కాడు. అది ఈ సృష్టి ఉన్నంత కాలం ఆరిపోని జ్యోతి. తన చుట్టూ పరిభ్రమించు గ్రహ ఉపగ్రహములకు ఉష్ణప్రకాశముల నిచ్చుచు అందలి ప్రాణులను కాపాడుచుండును. మార్జాలకిశోర న్యాయముగా వాటన్నిటిని తన ఆకర్షణ శక్తితో కాపాడుచుండును. విశ్వాంతరాళములో స్వస్తి పథమున పయనించుచుండును. కనుక సూర్యుని అనుసరింపుమనీ ప్రబోధించును.

వామనరూప యజ్ఞాగ్ని క్రమముగా విష్ణురూప ఆదిత్యు డగును. అట్లే, ఆచార్యునిచే బ్రహ్మచారి హృదయములో స్థాపింపబడిన శ్రద్ధారూప అగ్ని క్రమముగా వికసించి ఇంద్రియ మనోబుద్ధులను ప్రదీప్త మొనర్చును. ఆదిత్య బ్రహ్మచారిని చేయును. ఆ ఆదిత్య బ్రహ్మచారి మరెందరికో ఆదర్శముగా నిలచును. ఈ విధముగా ఈ లోకమున అధివిద్యా యజ్ఞము నిరంతరము జరుగుచునే యుండును.

వేదారంభ సంస్కార సమయమున ఆచార్యుడు బ్రహ్మచారిచే ఈ క్రింది మంత్రమును పఠింపజేసి యజ్ఞాగ్నిని ఏకత్రితము చేయించును.

**ఓం అగ్నే సుశ్రవః సుశ్రవసం మా కురు ।**

**ఓం యథా త్వ మగ్నే సుశ్రవః సుశ్రవా అసి ।**

**ఓం ఏవం మాం సుశ్రవః సౌశ్రవః సౌశ్రవసం కురు ।**

**ఓం యథా త్వ మగ్నే దేవానాం యజ్ఞస్య నిధిపా అసి ।**

ఓం ఏవ మహం మనుష్యాణాం వేదస్య నిధిపో

**భూయాసమ్ ॥ (పారాశ్కర గృ.సూ. 2-4-2)**

ఓ యజ్ఞాగ్నీ ! నీ వెట్లు ఈ లోకమున కీర్తిమంతుడవో నన్నును అట్టి కీర్తిమంతుని జేయుము. నీ వెట్లు దేవతల యజ్ఞనిధికి రక్షకుడవో అట్లే నన్నును మానవులకు సంబంధించిన వేదరూప నిధిని రక్షించువానినిగా జేయుము.

దీని భావ మేమన - మనసులో జనించు అనేకానేక ఆలోచనా తరంగములను ఏకత్రితముచేసి విద్యాభ్యాసమునందు కేంద్రీకృతము చేసినచో బుద్ధియందు ధారణశక్తి వృద్ధిచెందును. అప్పుడు గురువుచెప్పిన వేదవిద్యారూప నిధిని బ్రహ్మచారి చక్కగా ధారణచేసి రక్షించగలగును.

ఇట్లే, ఈ సంస్కారమునందలి మిగిలిన క్రియలన్నిటియందును యజ్ఞాగ్ని నుండి ప్రేరణ పొందవలె నను భావము నిహితమై యున్నది.

## ప్రజనన యజ్ఞము

మన భారతీయ సంస్కృతిలో సంతాన నిర్మాణము కూడా ఒక యజ్ఞముగానే చెప్పబడినది. దీనిని "ప్రజనన యజ్ఞము' అందురు. ఈ యజ్ఞమునందు స్త్రీ గర్భకోశము వేదిగాను, పురుషుని వీర్యస్థాపన అగ్న్యాధానముగాను ఉండును. స్త్రీ గర్భకోశమున స్థాపింపబడిన వామనరూప వీర్యాగ్ని వేదియందు అగ్ని విస్తరించునట్లు విస్తరించి పిండముగా మారును. అట్టి విస్తరణకు స్త్రీ తన రక్తమునే ఆజ్యముగా ఆహుతి నిచ్చుచుండును. నవ మాసములు నిండిన తదుపరి బిడ్డ రూపమున లోకమున కర్పించును.

ఇట్టి ప్రజనన యజ్ఞములో స్త్రీ శరీరము క్షేత్రముగాను, పురుషుని శరీరము బీజ ప్రదాతగాను ఉండును. మంచి ఫలసాయము సాధించుటకు క్షేత్ర బీజములు రెండును శుద్ధముగా పుష్టివంతముగా నుండుట అవుసరము. అట్లే మంచి సంతానము పొందవలెనన్న ఈ యజ్ఞములో పాల్గొను భార్యాభర్తల శరీరములు శుద్ధముగాను, పరిపూర్ణములుగాను ఉండవలెను. అందుచేతనే మన మహర్షులు గర్భాధానమును ఒక సంస్కారముగా రూపొందించిరి.

గర్భాధాన సంస్కారము ఒక విశిష్టమైన ప్రక్రియ. ఈ సంస్కారము జరుపుకొనుటకు పూర్వమే ఏన్నో జాగ్రత్తలు తీసుకొనవలసి యుండును. స్త్రీ పురుష లిరువురి శరీరములు ఆరోగ్యముగాను పరిపుష్టములుగాను ఉండవలెను. తగిన వయస్సు, మానసిక పరిపక్వతకూడా అవుసరమే. ఈ విషయములు వివరముగా తెలిసికొనగోరువారు మాచే ప్రచురింప బడిన "వైజ్ఞానిక సంస్కృతి" యను పుస్తకము చూడగోరెదను.

## మానవశరీరము ఒక యజ్ఞశాల

ఐతరేయ ఉపనిషత్ ఒక అద్భుతమైన వైజ్ఞానిక గ్రంథము. అందు సృష్టిరచన, పిండరచన ఆలంకారిక రూపములో సంక్షిప్తముగా చెప్పబడింది. అందు ప్రథమాధ్యాయమున ద్వితీయ ఖండమునందు ఒక కథానిక వచ్చును. అది ఏమన - ప్రజాపతియైన పరమేశ్వరుడు బ్రహ్మాండమును నిర్మించెను. అందు అనేక దేవతలను (దివ్యగుణములుగల పదార్థములను) రచించెను. భూలోక భువర్లోక స్వర్లోకములలో వివిధ దేవతలను సృజించెను. కాని, అవి వసించుటకు తగిన స్థానము చూపలేదు. తగిన గృహము (శరీరము) వాటికి చూపలేదు. అంత అవి ప్రజాపతిని సమీపించి 'మేము వసించుటకు తగిన గృహము (స్థానము) చూపు'మని ప్రార్థించినవి. అంత ప్రజాపతి "ఓ దేవతలారా! మీకొరకు ఒకే గృహము కాదు. అనేక లక్షల గృహముల నిర్మించితిని. అందు మీకు ఏది ప్రియమో దానియందు ప్రవేశింపు"దని చెప్పెను.

ప్రజాపతి తాను సృజించిన లక్షల ప్రాణి జాతుల శరీరములను చూపసాగెను. కాని, దేవతలు ఆ శరీరములలో ప్రవేశించుటకు ఇష్టపడకుండిరి. అంత ప్రజాపతి శుభలక్షణయుక్త గోవు శరీరమును చూపెను. అందు ప్రవేశించుటకును దేవతలు ఇష్టపడలేదు. తదుపరి అశ్వమును చూపెను. దానికిని దేవతలు అంగీకరించలేదు. చివరగా మానవ శరీరమును వాటి ఎదుట నిలిపి "దీనికన్న ఉత్తమ శరీరము మరొకటి లేదు" అని చెప్పెను. అంత దేవతలన్నియు ఆనందముతో నాట్యము చేయసాగెను. "మాకు తగిన శరీరము ఇదే. మాకు తగిన శరీరము ఇదే" అని పాట పాడుచు మానవ శరీరములో వాటికి తగిన స్థానములు వెదుకుట ప్రారంభించినవి.

**అగ్నిర్ వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్,**
**వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్**
**ఆదిత్య శ్చక్షుర్ భూత్వా అక్షిణీ ప్రావిశత్**
**దిశః శ్రోత్రం భూత్వా కర్ణే ప్రావిశన్**
**ఓషధి వనస్పతయో లోమాని భూత్వా త్వచం ప్రావిశన్**
**చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్**
**ఆపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్.** (ఐతరేయ ఉపనిషత్. 1-2-4)

అగ్నివాక్‌గా మారి ముఖమునందు అనగా నోటియందు ప్రవేశించెను. అట్లే వాయువు ప్రాణముగా మారి ముక్కులలోను, ఆదిత్యుడు నేత్రమై కన్నుల యందును, దిక్కులు శ్రోత్రమై (శ్రవణీంద్రియమై) చెవులలోను, ఓషధీవనస్పతులు రోమములై చర్మమునందును, చంద్రుడు మనసుగా మారి హృదయమునందును, మృత్యువు అపానమై నాభియందును, జలము రేతస్సుగా మారి శిశ్నమునందును ప్రవేశించెను.

ఈ విధముగా బ్రహ్మాండములోని దేవతలన్నియు ఈ పిండరూప మానవ శరీరములో ప్రవేశించినవి. అందుచేతనే పెద్దలు 'యద్ బ్రహ్మాండే తద్ పిండే, యద్ పిండే తద్ బ్రహ్మాండే – ఏది బ్రహ్మాండమున గలదో అది ఈ పిండమున (మానవ శరీరమున) ఉన్నది. ఏది ఈ పిండమున గలదో అదియే బ్రహ్మాండమున నున్న' దని చెప్పుదురు. ఎట్లు ఈ బ్రహ్మాండము పూర్ణమో అట్లే ఈ పిండమును పూర్ణమే. కావుననే ఈ పిండమును (మానవ శరీరమును) "పుర" మని పేర్కొందురు.

ఈ పిండ పురమున వసించు దేవతలకు మనము ఆహుతు లర్పించవలసి యున్నది. లేకున్న యవి నిష్క్రమించును. అంత శరీరము శవమగును. కావున ప్రతి దినము జఠరాగ్ని యను అగ్నిహోత్రములో

ఆహార మను ఆజ్యమును ఆహుతులుగా నివ్వవలసియుండును. ఆ యాహారము హితముగా, మితముగా, ఋతముగా (న్యాయర్జితముగా) నుండవలెను.

పరమేశ్వరునిచే సృజింపబడిన ఈ మానవ శరీరములో నిత్యము అగ్నిహోత్రము జరుగుచునే యున్నది. ఇంద్రియములు జఠరాగ్నిలో అన్నాహుతులిచ్చుచు "తేన ఇధ్యస్వ వర్ధస్వ" దీనితో నీవు ప్రకాశించుము, వర్ధిల్లుము అని స్తుతించును. చ ఇద్ధ వర్ధయ చాస్మాన్ - మరియు మమ్ము కూడా ప్రకాశపరచుము, వర్ధిల్లజేయుము" అని ప్రార్థించును. అందుకు అనుగుణముగానే జఠరాగ్ని అన్నాహుతులను స్వీకరించి రసముగా మార్చి ఇంద్రియములను పోషించును. ప్రకాశపరచును.

ఇట్లే, జ్ఞానేంద్రియములు జీవాత్మ యను అగ్నిలో శబ్ద స్పర్శ రూప రస గంధము లను ఆహుతు లిచ్చుచుండును. అందువలన జీవాత్మ యొక్క జ్ఞానము ప్రకాశింపబడును. వర్ధిల్లును. అందుకు ప్రత్యుపకృతిగా జీవాత్మ ఇంద్రియములకు తన శక్తినిచ్చి వాటిని ప్రకాశపరచును. వర్ధిల్లజేయును.

## వేది ఒక నాట్యవేదిక

నాట్యకళాకారిణులు రంగస్థల వేదికపై తమ హావభావములను కేవలము అభినయముతోనే తెలుపుదురు. అట్లే అగ్నిహోత్రవేదికపై సమిధా ఘృతములు అభినయించుచు తమ హావభావములను తెలుపుచుండును.

మానవ జీవనము ఒక యాత్ర వంటిది. ఆ జీవనయాత్రలో అగ్ని మనకు మార్గము చూపు జ్యోతి. ఆ అగ్ని మందగించకుండా ఉండాలంటే అందు సమిధలు పడుతూ ఉండాలి. సమిధలు మామిడి, మోదుగ, రావి ఏవైనా కావచ్చును. కాని, వాటి భావము ఒక్కటే.

అదియే సమర్పణ. 'సమతా ఏకీభూయ దీప్యతే దీపయతీ చ' అది స్వయముగా ప్రకాశిస్తూ మార్గమును ప్రకాశపరచుట. అందుకై అది తన సర్వస్వమును అర్పించుకొనును.

మనం ముందుగా తెలిసికొన్నట్లు సమిధా పదము 'ఇన్ధీ దీప్తౌ'ధాతువునకు 'సమ్' ఉపసర్గ చేర్చుటవలన ఏర్పడును. ఏది అగ్నిని ప్రకాశపరచుటకు తన సర్వస్వమును అర్పించుకొనునో అదియే సమిధ. యాస్క మహర్షి తన నిరుక్త శాస్త్రమున ఈ పదమును నిర్వచించుచు 'సమిత్యేకీభావే' – అనేకమును ఒక్కటిగా చేయుట – అని చెప్పెను. సమిధలలో నున్న విశేషత ఏమన అవి అనేకమైనను ఒక్కటిగా కలిసి జ్వలించును. అవి వేరువేరుగా జ్వలించుట లేదా వేరువేరుగా ప్రదీప్తమగుట కష్టమే. రెండు మూడు నాలుగు ఈ విధముగా ఎన్ని కలిసిన అవి అంత ఎక్కువగా ప్రదీప్తమగును. కాన, సమిధలు అనేకమయ్యు ఐకమత్యముతో నుండి ఒకే అగ్నిజ్వాలగా జ్వలించును. అందువలన సమిధలు దీప్తిమంతము లగును. అగ్నిని దీప్తిమంతయు చేయును. 'సమ్' ఉపసర్గలో ఉన్న విశేషత యిదియే.

యాజకులమైన మనము సమిధా అగ్నులలో దేనిని ఆదర్శముగా చేసుకోవాలి. సమిధలనా? అగ్నినా ? అను ప్రశ్న ఉదయించుట సహజము. దీనికి సమాధాన మేమన – యాజకుడు మానవ సమాజములో నేతగా ఉంటే అగ్నిని అనుసరించాలి. అనుయాయిగా ఉంటే సమిధలను అనుసరించాలి. తోటి అనుయాయిలతో ఏకీభావనతో కలిసి నేతకు సహకరించాలి. నేతయు తన అనుయాయుల సహకారంతోనే ప్రదీప్తుడైనట్లు గుర్తించి వారితో ఏకీభావన చెందాలి.

అన్ని రంగములలోను నేత ఒక్కడు, అనుయాయులు అనేకులు

ఉండుట చూడనగును. రాజు అగ్ని అయితే ప్రజలు సమిధలు. సేనాపతి అగ్ని అయితే అతనికి సైనికులు సమిధలు. ఆచార్యుడు అగ్ని అయితే శిష్యులు అతనికి సమిధలు, మన శరీరములో జీవాత్మ అగ్ని అయితే ఇంద్రియములు అతనికి సమిధలు. ఈ విధముగా నేత, అనుయాయుల దీప్తి వారి పరస్పర సంగతిపై ఆధారపడి యుండును. ఆ సంగతి సహయోగములు సంగతికరణముపై ఆధారపడి యుండును. ఈ విధమైన నేతా అనుయాయుల సంఘీభావము వారిని అన్ని రంగములలోను విజయులను చేయును.

ఇక ఆజ్యమిచ్చు అభినయ సందేశ మేదియో తెలిసికొందము. దేని ద్వారా విజయ లాభము ప్రాప్తించునో, ఏది సర్వదా విజేతగా నుండునో దానినే ఆజ్య మందురు - ఆ సమన్తాత్ యజ్జితం తదాజ్యమ్; ఆజయమేవ ఆజ్యమ్ అని నిర్వచనము. వాస్తవముగా విజయమునే ఆహుతిగా నర్పించుట ఉత్తమము. పరిశీలించి చూచిన ఆజ్యమునందు ఈ విజయము గోచరించును.

ఆజ్యమును సంపాదించవలెనన్న పాలలోని క్రొవ్వు కణములను ఒకచోట సంగ్రహించవలసి యుండును. ఆ విధముగా సంగ్రహించి వెన్నముద్దను పిడికిట పట్టుట జయమును పట్టుటయే అగును. అట్లే విజయమును పిడికిటబట్టి హవిస్సుగా నర్పించుట ఉత్తమము. అట్టి హవిస్సుయొక్క నామమే ఆజ్యము.

ఆజ్యమును హస్తగతము చేసుకొనవలెనన్న ఎన్నో జాగ్రత్తలు పాటించవలసి యుండును. ముందుగా గోసేవ చేయవలసియుండును. పాలను దూడ త్రాగివేయకుండా జాగ్రత్తపడాలి. గోమాతనుండి జాగ్రత్తగా పాలను పితికి శుద్ధమైన పాత్రలోపోసి చక్కగా కాచాలి. తదుపరి

సత్యజ్ఞాన మను ఆజ్యముయొక్క విశేషత ఏమన - అది మానవులలో మందగించుచున్న శ్రద్ధాగ్నిని మరల పునరుద్ధరించును. ప్రకాశపరచును. వృద్ధిచేయును. జాగరూకుల జేయును. ఆ విధముగా మానవుల హృదయాలలో వృద్ధిచెందిన శ్రద్ధాగ్ని సత్యస్వరూప పరమాత్మ సాక్షాత్కారమును కలిగించును. శ్రద్ధయా సత్య మాప్యతే (యజుర్వేదము 19-30)

ఇట్టి సత్యజ్ఞాన మను ఆజ్యముతోనే మహాయజ్ఞములు నిర్వహింపబడును. అది అక్షయము. తరుగనిది. కోట్లాది మానవ హృదయాలలోని శ్రద్ధాగ్నులలో పడినను అది సమాప్తము కాదు. తరగిపోదు. అందుచేతనే యాజ్ఞవల్క్య మహర్షి 'శ్రద్ధా అగ్నిః సత్యమాజ్యమ్' అని అగ్నిహోత్రము యొక్క అంతిమ స్వరూపమును తెలిపెను.

## ఆజ్యము స్నేహమునకు ప్రతీక

ఆజ్యము (నేతి) లో స్నిగ్ధత ఉండును. అది పిండిలోని అణువులను ఒకటిగా కలిపి ముద్దగా చేయును. స్నిగ్ధతతోకూడిన ఆ కలియక స్నేహమును సూచించును. దానిలోని స్నిగ్ధత రెండు కర్కశ వస్తువులనుకూడా మృదువుగా కలుపగలదు. ఇది మనకు యంత్రములలో స్పష్టముగా కనబడును. యంత్రములు తిరుగునపుడు రాపిడి కలుగుట సహజము. అది కర్ణకఠోరముగా నుండును. వాటి మధ్యలో కొన్ని చుక్కలు ఘృతము వేసినచో చప్పుడు మృదువుగా మారును. రాపిడివలన కలుగు అరుగుదల తగ్గును. వాటి జీవన పరిమాణము పెరుగును. అట్లే అగ్నిహోత్రములో సమిధా హవిస్సుల మధ్య ఘృతము మృదుత్వమును కలిగించును. అగ్నిహోత్రములో మాధుర్యమును

కలిగించును.

అధిసంవత్సర యజ్ఞములో వసంతఋతువు ఆజ్యముగా నుండునని వేదము చెప్పును.

యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత ।
వసన్తో ऽస్యాసీ దాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః ॥
(యజుర్వేదం. 31-14)

విరాట్ పురుషునిచే నిర్వహింపబడు అధి సంవత్సర యజ్ఞములో వసంతఋతువు ఆజ్యముగాను, గ్రీష్మఋతువు సమిధలుగాను, శరద్ఋతువు హవ్యముగాను ఉండును.

ఋతువు లన్నిటిలోను వసంతఋతువు మనోహరమైనది. చెట్లన్నియు చిగిర్చి పూలతో శోభాయమానముగా నుండును. మనకు ఉల్లాసమును కలిగించును. కర్కశ హృదయముగల వాని యందును కొంత మృదుత్వమును కలిగించును. అందుచేతనే వేదము వసంత ఋతువును ఆజ్యముతో పొల్చుచున్నది.

నిజ జీవితంలో మనం ఎందరితోనో వ్యవహరించవలసి ఉంటుంది. అప్పుడు మనం ఆజ్యంవలె వ్యవహరించడం ఉత్తమం. లేకున్న కర్ణకఠోరమైన శబ్దములు వినవలసి వస్తుంది. తోటి మానవులతో మనం స్నేహపూర్వకంగా వ్యవహరించవలెనని ఆప్తవచనం. మహర్షి దయానందులవారు సూచించినట్లు "అందరితో ప్రేమపూర్వకముగా, ధర్మానుసారముగా, యథాయోగ్యముగా వ్యవహరించాలి" అప్పుడు సమాజం స్వర్గంగా-సుఖమయంగా గోచరిస్తుంది.

## యజ్ఞమయ జీవనము

శతపథ బ్రాహ్మణము అగ్నిహోత్రమును కర్మకాండపరముగాను, ఆధ్యాత్మపరముగాను వ్యాఖ్యానించు అద్భుత గ్రంథము. దీని ప్రతిపాద్య విషయము పూర్ణమాసేష్టి మొదలు అశ్వమేధయజ్ఞ పర్యంతముగల వివిధ శ్రౌత యజ్ఞముల విశేష వ్యాఖ్య. అందలి ప్రథమ ఖండమున పూర్ణమాస్ యజ్ఞముయొక్క వివరణ ఉంది. రెండవ ఖండమున అగ్న్యాధాన, అగ్నిహోత్రాది క్రియలు వర్ణింపబడినవి. తృతీయ - చతుర్థములందు సోమయాగము యొక్కయు, పంచమమునందు వాజపేయ మరియు రాజసూయముల యొక్కయు, షష్ఠ నుండి దశమ వరకు అగ్నిచయనము యొక్కయు, పదునొకండవ ఖండమున దర్శపూర్ణమాస యజ్ఞముల రహస్యము యొక్కయు వ్యాఖ్యము ఉన్నవి. పంద్రెండవ ఖండమున సౌత్రామణి. పదమూడున అశ్వమేధము, పదునాల్గున బ్రహ్మవిద్యా సంబంధమైన చర్చ గలవు.

పూర్వ ప్రకరణములలో మనము దేవాసుర కలహముల గురించి తెలిసికొని యుంటిమి. ఆ సందర్భమున అసురులు అగ్నిని లౌకిక ప్రయోజనములకు వాడుకొనగా, దేవతలు అగ్నిని ఆత్మలో ధరించి అమరులైనట్లు చెప్పుకొని యుంటిమి. ఇచట అమరు లనగా ఎప్పటికిని మృత్యువును పొందరని అర్థముకాదు. ఈ విషయము శతపథ బ్రాహ్మణము ఈ క్రింది విధముగా వివరిస్తుంది.

అథైవం దేవాః। అన్తరాత్మన్నా దధత త ఇమ మమృత మన్తరాత్మన్నాధాయామృతా భూత్వా ఽస్తర్యా భూత్వా స్తర్యా న్ను పత్నాన్ మర్త్యా న భయభవంస్తథోఽ ఏవైష ఏతదమృతమన్తరాత్మన్నాధత్తే నామృతత్వస్యాశాస్తి సర్వమాయురే తృస్తార్యో హైవ భవతి న హైనం

సపత్నస్తుస్తూర్షమాణశ్చ స్తృణుతే తస్మాద్యదాహితాగ్నిశ్చానాహితాగ్నిశ్చ స్పర్ధేతే ఆహితాగ్నిరేవాభిభవత్యస్తార్యో హి ఖలు స తర్హి భవత్యమృతః ॥ (శతపథ బ్రాహ్మణము. 2-2-4-14)

భావార్థము : అందుచే దేవతలు అగ్నిని అంతరాత్మలో ధరింతురు. వారు ఈ అమృతమైన అగ్నిని అంతరాత్మలో ధరించి అమృతులై అనగా అణచబడనివారై దండించదగిన పతితులైన మరణధర్ములైన అసురులను జయించుచు వచ్చిరి. ఈ కారణముచే ఇప్పుడుకూడా అగ్న్యాధాన క్రియ ద్వారా యజమాని (యాజకుడు) అగ్నిని అంతరాత్మలో ధరించును. ఇచట అమరులగుట యన ఎప్పటికిని మరణించకుండ యుందురని అర్థము కాదు. ఏలనన శారీరకముగా అమరులగుట యనునది అసంభవము. కాన, వారు పూర్ణాయువును భోగింతురనియు, అపజయమును బొందరనియు భావము. యశఃకాయముతో చిరంజీవులగుదురు. ఆహితాగ్ని అనాహితాగ్నుల మధ్య యుద్ధము సంభవించిన అందు ఆహితాగ్నియే జయించును. అనాహితాగ్ని అపజయము పాలగును. ఆహితాగ్నిని ఎవరును జయించలేరని భావము.

యజ్ఞము యొక్క ముఖ్యోద్దేశ్యము ఆత్మ సంస్కరణము. మిగిలిన క్రియాకలాపములన్నియు గౌణములు. దీనికి మరొక ప్రమాణమును పరిశీలింతము. తదాహుః ఆత్మయాజీ శ్రేయన్ దేవయాజీ ఇతి । ఆత్మయాజీ ఇది బ్రూయాత్, స హ వా ఆత్మయాజీయో వేదేదం మేఽ నేనాఙ్గం సంస్క్రియత ఇదం మేఽనేనాఙ్గ ఉపధీయత ఇతి । స యథా హి స్త్వచో నిర్ముచ్యతైవ మస్మాన్ మర్త్యాచ్ఛరీరాత్ పాప్మనో నిర్ముచ్యతే స ఋఙ్మయో యజుర్మయః సామమయః ఆహుతిర్మయః స్వర్గం లోకమభిసం భవతి । (శత. బ్రా. 11-2-6-13)

భావార్థము : దేవయాజి గొప్పవాడా ? ఆత్మయాజి గొప్పవాడా? అనుప్రశ్న ఉదయించును. అట్టి సమయమున ఆత్మయాజియే యని చెప్పవలెను. ఏలనన తన శరీరాంగములు ఎంత సంస్కరింపబడినవో ఎంతవరకు సువ్యవస్థితములు అయినవో ఆత్మయాజి తెలిసికొనును. అందుచే ఏ ప్రకారము సర్పము తనపై ఏర్పడిన పొరను విడచి ప్రకాశించునో అట్లే ఆత్మయాజి మరణధర్మశీలమైన శరీరమునుండి విముక్తుడై ఋఙ్మయ యజుర్మయ సామమయ మరియు ఆహుతిమయుడై స్వర్గ లోకమున స్థిరపడును.

ఇట స్వర్గలోకమును బొందు ననగా మరణించిన తదుపరి కాదు. జీవితుడై ఉన్నపుడే యని గ్రహించవలెను. కావుననే సర్పము కుబుసమును విడచినట్లు అని ఉపమానము చూపబడినది. కుబుసమును విడచునది జీవిత సర్పమే కదా ! మృతసర్పము కాదు కదా !

అసురులు అగ్న్యాధాన క్రియ నెరుగరు. వారు అగ్నిని ఉదరపోషణ కొరకు ఉపయోగించిరి. స్వార్థులైరి. దేవతలు అట్లుకాక అగ్నిని అగ్నిహోత్రములో ఆధానముచేసి వాయుజలములను శుద్ధిచేసి తద్వారా సర్వప్రాణులకు ఉపకారము చేసిరి. దానితోబాటు అగ్నిని ఆత్మలోకూడా ఆధానము చేసుకొని పరోపకార పరాయణులై జీవించిరి. వారి వారి గుణ కర్మ స్వభావములకు తగిన వర్ణాశ్రమ ధర్మములను స్వీకరించి సమాజసేవకు అంకితమైరి.

దేవత లనగా ఎక్కడనో విశేష లోకమున వసించువారని అర్థము కాదు. ఈ లోకముననే మానవులలోనే పరోపకరాము చేయుచు పవిత్ర జీవనము గడుపువారినే దేవత లందురు. అందుకు భిన్నముగా ఇంద్రియ సుఖములలో రమించుచు తమ స్వార్థము కొరకే జీవించువారిని అసురు

లందురు. దేవతలలో కొందరు సత్యజ్ఞానరూప అగ్నిని ఆత్మలో ధరించి బ్రాహ్మణు లగుదురు. మరికొందరు యశఃరూప అగ్నిని ధరించి క్షత్రియ లగుదురు. కొందరు శ్రీఃరూప అగ్నిని ధరించి వైశ్యు లగుదురు. మిగిలినవారు సేవావృత్తిని స్వీకరించి సమాజసేవకు అంకితులగుదురు. ఇట్టి దేవతలు కాలాంతరమున శారీరకముగా మరణించినను యశః శరీరముతో అమరులగుదురు. వారి త్యాగము, తపస్సు, సంఘటన అపజయము నందదు.

శ్రీ స్వామి సమర్పణానంద సరస్వతిగారు ప్రఖ్యాత ఆర్యవిద్వాంసులు. వీరి పూర్వనామము ఆచార్య పం. బుద్ధదేవ్ విద్యాలంకార్. వీరు వేద వేదాంగ ఉపాంగములనేగాక బ్రాహ్మణ ఆర్యణకాదులను కూడా లోతుగా అధ్యయనము చేసిన పూర్ణవిద్వాంసులు. వీరు శతపథ బ్రాహ్మణమునకు కొంతవరకు ప్రామాణిక భాష్యమును వ్రాసిరి. ఆ భాష్యముయొక్క భూమికలో యజ్ఞము యొక్క అర్థమును వివరించుచు ఈ విధముగా వ్రాసిరి.

"శతపథ బ్రాహ్మణమును అధ్యయనము చేసిన అనంతరం నేను యజ్ఞ పదమునకు అర్థం ఈ విధంగా గ్రహించితిని.

**'కల్యాణార్థినా సాముదాయకం యోగక్షేమముద్దిశ్య సముదా యాంగతయా క్రియమాణం కర్మ యజ్ఞః'** అనగా (మానవ) కల్యాణమును కోరువారు ఎవరైనా తనను తాను సముదాయము యొక్క (మానవ సమాజము యొక్క) అంగముగా భావించి ఏ సముదాయమునకు తనను అంగముగా భావించునో ఆ సాముదాయక యోగక్షేమముల కొరకు ఏ **కర్మ చేయబడునో దానిని యజ్ఞము అందురు"** అని వ్రాసిరి. ఆ తదుపరి తాను ఆ లక్షణమును గ్రహించుటకు గల కారణములను

సప్రమాణికముగా తెలిపిరి.

కావున, యజ్ఞమనగా 'సార్వజనిక ప్రయోజనము కొరకు చేయబడు ఉత్తమ కర్మలు' అని గ్రహించాలి. తాను వసించు సమాజమునకు, రాష్ట్రమునకు, దేశమునకు ఎప్పుడెప్పుడు ఏవేవి అవసరమో గుర్తించి ఆ యా కార్యములు చేపట్టాలి. తగిన సామర్థ్యమున్నచో నేతగాను, లేకున్న అట్టి నేతకు అనుయాయిగాను కృషి చేయాలి. అట్టి కర్మలనే యజ్ఞ మంటారు. ఆ యజ్ఞార్థ కర్మలే మనకు ముక్తిని కలిగించునని యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుని ఉపదేశము.

**యజ్ఞార్థాత్ కర్మణో౽న్యత్ర లోకో౽యం కర్మ బన్ధనః ।**
**తదర్థం కర్మ కౌన్తేయ ! ముక్త సంగః సమాచర ॥**

**(భగవద్గీత. 3-9)**

లోకహిత భావనతో చేయబడు కర్మలుకాక మిగిలిన కర్మలవలన ఈ ప్రాణిసముదాయము కర్మలతో బంధింపబడును. కావున, ఓ కుంతీపుత్ర ! యజ్ఞముకొరకు కర్మలు చేయుము. కర్మఫలమునందు ఆసక్తిని విడిచిపెట్టుము. నీ పూర్ణశక్తి సామర్థ్యములతో ఆ కర్మలను చక్కగా ఆచరింపుము.

శ్రీ కృష్ణుడు యజ్ఞమయ జీవితమును గడపిన ఒక గొప్ప కర్మయోగి. 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః
**ఏవం త్వయి నాన్యథే తో౽స్తి న కర్మ లిప్యతే నరే."**

**(యజు. 40-2)**

అను వేదోపదేశము ననుసరించి జీవితము గడపిన ఒక మహాపురుషుడు. కర్మలు బంధనములు కాకుండా ఎట్లు జీవించవలెనో ఉపదేశించిన ఆదర్శగురువు.

సత్కర్మల నాచరించుటవలన పుణ్యము, దుష్కర్మల నాచరించుట వలన పాపము కలుగు ననునది సృష్టినియమము. ఈ పాపపుణ్యములే మరల మరల జన్మలను కలిగించుచుండును. ప్రయత్నించి కేవలము సత్కర్మలనే ఆచరించినను ఆ పుణ్యఫలము ననుభవించుటకును జన్మను పొందవలసియుండును. జన్మించిన ప్రతి ప్రాణికి జన్మ జరా వ్యాధి మృత్యువు లను నాలుగు దుఃఖములు తప్పవు. ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక దుఃఖములు కలుగుచుండుటయు సహజము. జయాప జయములు, మానావమానములు, హానిలాభములు కలుగుచుండును. ఇవన్నియు క్లేశములే - బాధలే. కనుక, కర్మలు బంధనములు కాకుండుటకు ఉపాయము వెదకుట అనివార్యము. ఆ ఉపాయ మెద్దియో శ్రీకృష్ణుడు భగవద్గీతద్వారా చక్కగ ఉపదేశించెను.

కర్మలు బంధనములు కాకుండా నుండవలెనన్న ఫలాకాంక్షను వదలవలెను. శక్తికొలది సత్కర్మల నాచరించుచు వాటి ఫలముపై రాగము విడువవలెను. ఆ కర్మలవలన ఈ లోకమున పేరు ప్రతిష్ఠ లనుగాని, ఇంతకన్నను ఎక్కువ సుఖమును కలిగించు జన్మనుగాని కోరరాదు. ఆ ఫలితమును పరమేశ్వరునికి అర్పించి పరమేశ్వరుని ఆనందమును తప్ప మరేమియు వాంఛించరాదు. దీనినే పతంజలి మహర్షి 'ఈశ్వర ప్రణిధానము' అని తన యోగశాస్త్రమున తెలిపెను.

ఈ విధముగా ఈశ్వర ప్రణిధానము చేయు వ్యక్తికి క్రమముగా ప్రాపంచిక సుఖములపై రాగము తగ్గి, పరమేశ్వరునిపై రాగము పెరుగును. పరమేశ్వరునిపై అనన్య భక్తి కలుగును. 'హే పరమేశ్వర నీవు తప్ప నాకు మరేమియు వద్దు' అను భావము స్థిరపడును. అప్పుడు కర్తవ్య కర్మలనాచరించునపుడు అపజయము కలిగినా, హాని కలిగినా,

అవమానము కలిగినా, నష్టము కలిగినా, కష్టము కలిగినా విచలితుడు కాడు. విజయాలకు, సన్మానాలకు పొంగిపోడు. ఇదియే స్థిత ప్రజ్ఞత. ఇట్టి స్థితిని పొందుటకు కర్మఫల త్యాగము మొదటి మెట్టు.

కావుననే, శ్రీకృష్ణుడు యజ్ఞార్థకర్మలను ముక్త సంగుడవై ఫలాకాంక్ష లేకుండా చేయుమని ఉపదేశించెను. దానితోబాటు సమాచర – చక్కగా నీ పూర్ణ శక్తి సామర్థ్యములను ఉపయోగించి లోకహిత కార్యములు చేయమనెను. పరమానంద స్వరూప పరమాత్మున కర్పించు కర్మలు శ్రేష్ఠమైనవిగా నుండవలెను. అట్టి శ్రేష్ఠతమ కర్మకు ప్రతీక – ఉపమానము అగ్నిహోత్రము. ప్రతిదినము ఉదయ సాయంకాలములందు అగ్నిహోత్రము చేయుచు ఇటువంటి ప్రేరణను పొందవలెను. అప్పుడు అగ్నిహోత్రమువలన కలుగు భౌతిక ప్రయోజనముతో బాటు ఆధ్యాత్మిక ప్రయోజనము అనగా ఆత్మికోన్నతి కలుగును.

'కస్మై దేవాయ హవిషా విధేమ'

అంతర్యామియైన ఆనందస్వరూప పరమేశ్వరునకు నేను చేసిన సత్కర్మలను హవిస్సుగా విధేయతతో అర్పించుచున్నాను.

'ఇదం న మమ'

'ఈ సత్కర్మల ఫలము నాకొరకు కాదు. లోకహితము కొరకు, నాకు నీవు తప్ప మరేమియు వద్దు.

**సర్వే భవంతు సుఖినః, సర్వే సంతు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చిద్ దుఃఖభాగ్భవేత్ ।**

ఓం శాంతిః శాంతిః శాంతిః

Gayatri Series : 40
Agnihotra Aadhyatmika Swaroopam Rs. 30=00



One should not be content
with one's own welfare alone,
but should look for one's own welfare
in the welfare of all

- Maharshi Dayananda Saraswati

*Published by :*

GAYATRI ASHRAM TRUST

12-10-586/6, Vyas Samajam, Medi Bavi,
Seetapalmandi, Secunderabad - 500 061.